# మానవుడేకర్త

మూలం

జేమ్స్ ఎలెన్

విశ్వవిఖ్యాతతత్త్వవేత్త

అనువాదకుడు

తిపిర్నేని లక్ష్మీనారాయణ

# అంకితము



సరసులు, సహృదయులు, శాంతస్వభావులు

నాకు చిరకాలపరిచితులు

వేంకట్రామా అండ్ కో ప్రొప్రయిటరు

**శ్రీ ఈదర వెంకట్రామయ్యగారికి**

సాదరముగ

— తిపిర్నేని లక్ష్మీనారాయణ

# అభినందన

మానవుడు స్వతంత్రుడా! అస్వతంత్రుడా? ఇది చిరకాలంగా తత్వవేత్తలను వేధిస్తున్న ప్రశ్న.

కొందరు మానవుడు అస్వతంత్రుడని అంటారు. ప్రకృతిలో ప్రతిది కార్యకారణబద్ధమై ఉంటుంది. ప్రతిది మరొకదానికి కారణమవుతుంది. అది వేరొకదానికి కారణమవుతుంది. ఈ కార్యకారణసూత్రం అనంతం. మానవుడు కూడ ప్రకృతిలో భాగమే కనుక అతడుకూడ కార్యకారణ సూత్రబద్ధుడే. ఒకపని తాను తన ఇచ్ఛానుసారంగా చేస్తున్నానని మానవుడు భావించినప్పుడుకూడా, అతనికి తెలియకుండా అతనిపని అంతకుముందు చేసినపనినిబట్టి లేదా ఆలోచననుబట్టి నియతమై ఉంటుంది. "బుద్ధిః కర్మానుసారిణీ" అని ఆర్యోక్తి. శివాజ్ఞలేనిదే చీమైనా కుట్టదని సామెత. పూర్వజన్మలో చేసిన పనులనుబట్టే ఈ జన్మలో మనిషిచేసే పనులు ఉంటాయన్నది ఒకమత విశ్వాసం.

అయితే మరికొందరు మానవుడు స్వతంత్రుడని వాదిస్తారు. అతనికి free will నిర్ణయస్వేచ్ఛ వున్నదని భావిస్తారు. మంచిచెడులలో ఏదోఒకదాన్ని, నీతి అవినీతులలో ఏదోఒకదాన్ని ఎంచుకునే స్వేచ్ఛ మానవునికి ఎల్లప్పుడూ వుంటుందని వారి విశ్వాసం.

పాశ్చాత్య తత్వవేత్తలలో అస్తిత్వవాదం అనే ఒక శాఖకు చెందినవారు ఈ నిర్ణయ స్వేచ్ఛావాదాన్ని పరాకాష్ఠకు తీసుకువెళ్లారు. నిర్ణయస్వేచ్ఛ లేని దే మానవుడే లేడని, నిజానికి మానవుడు స్వేచ్ఛాశాపగ్రస్తుడని (Man is Condemned to be Free) జాంపాల్ సార్త్ర అనే తత్వవేత్త అభిప్రాయం.

నియతివాదం (డిటర్మినిజం) స్వేచ్ఛావాదం (Freewill) ఈ రెండింటిలో ఏది నిజమనే ప్రశ్న ఎడతెగనిది.

జేమ్స్ ఎలెన్ అనే అమెరికన్ తత్వవేత్త తన Man King of mind, Body and circumstence అనే గ్రంథంలో మానవుడు స్వతంత్రుడు అనే వాదాన్ని సమర్థించాడు. మానవుడు బాహ్యప్రపంచాన్ని తనకు అనుగుణంగా మార్చలేకపోవచ్చు. కాని బాహ్యప్రపంచానికి అనుగుణంగా తన మనస్సును మార్చుకొని తాను పెట్టుకున్న లక్ష్యాలను సాధించగలడు. మానవుడు నిస్సహాయుడు కాడు, పరతంత్రుడు కాడు. అతడు తాను ఎటువంటివాడు కాగోరితే అటువంటివాడు కాగలడు. ఒక మనిషి ఎప్పుడూ చెడు ఆలోచనలు చేస్తుంటే చెడ్డవాడవుతాడు. మంచి ఆలోచనలు చేస్తుంటే మంచివాడవుతాడు. ఆలోచనలను బట్టే ఆచరణ వుంటుంది. మానవుడి ఆలోచనలు, అలవాట్లు, ఆచరణ, శరీరారోగ్యం ఇవన్నీ అతడి స్వభావాన్ని నిర్ణయిస్తాయి. అతడి చుట్టూ

వున్న సాంఘిక పరిసరాలు ఎటువంటివైనా, వాటిని అతిక్రమించి తన భవిష్యత్తును, తన జీవితాన్ని తీర్చి దిద్దుకునే స్వేచ్ఛ అతనికి వుంది.

నీతిమంతుడు కాగోరినవ్యక్తి నీతిమంతాలైన ఆలోచనలు చేయాలి, అటువంటి అలవాట్లు అలవరచుకోవాలి. నైతికజీవనం నిరంతర సాధనవల్ల సాధ్యమవుతుంది.

వ్యక్తిజీవితంలో నైతిక నిష్ఠాప్రాధాన్యాన్ని జేమ్స్ ఎలెన్ పైన పేర్కొన్న ఇంగ్లీషు పుస్తకంలో చక్కగా వివరించారు. దాన్ని శ్రీ తిపిర్నేని లక్ష్మీనారాయణగారు హిందీ నుండి తెలుగులోకి అనువాదంచేశారు.

శ్రీ లక్ష్మీనారాయణగారు జిజ్ఞాసువు, ఆలోచనాపరులు. ఈ రోజులలో నైతికమూల్యాల పతనంపట్ల ఆవేదనచెందే స్వభావం కలవారు. సద్గ్రంథపఠనంవల్ల, సత్సాంగత్యంవల్ల జీవితం తీర్చిదిద్దుకున్నవారు. హిందీ ప్రచారకులు. ఇదివరలో కొన్ని గ్రంథాలు వ్రాశారు. జేమ్స్ ఎలెన్ పుస్తకాన్ని "మానవుడే కర్త" అనే పేరుతో తెలిగించారు. అనువాదభాష సరళంగా తేటతెల్లంగా వుంది. అందుచేత ఎల్లరు ఆసక్తితో పఠించడానికి యోగ్యంగా వుంది. ఈ మంచిగ్రంథం తెలుగువారికి అందించినందుకు శ్రీ లక్ష్మీనారాయణగారిని అభినందిస్తున్నాను.

విజయవాడ
4-9-89

— **నండూరి రామమోహనరావు**
ఎడిటర్, ఆంధ్రజ్యోతి (దినపత్రిక)

# కృతజ్ఞతలు

నిరంతర సంపాదకీయ కార్యనిమగ్నులయి యుం సుప్రసిద్ధపాత్రికేయులు, 'ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకులు శ్రీ నండూరి రామమోహనరావుగారు నేను కోరినంత నా యీ పుస్తకమునకు తొలిపలుకు వ్రాయుట కంగీకరిం టనుబట్టి వారి విశాలోన్నత సహృదయత తేటతెల్లము చున్నది. అట్లగుటవారికి నేను వినయవినమిత మస్తకముతో కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుచున్నాను.

నాకు చిరకాలపరిచితులు, వేంకట్రామా అండ్ ప్రొప్రయిటరు శ్రీ ఈదర వెంకట్రామయ్యగారు పుస్తకాన్ని పఠించి ఆనందించి తన ప్రెస్సులో అచ్చు వేయించి యిచ్చినారు. వారి యీ ఔదార్య ప్రశంసనీయము.

వారికి మనః పూర్వకంగా కృతజ్ఞతను తెలపుకొనుచు సంతృప్తిజెందుచున్నాను. వారికి పరమేశ్వరు పరిపూర్ణాయురారోగ్యముల ప్రసాదించుగాక !

20-9-89 తిపిర్నేని లక్ష్మీనారాయణ

రించు కార్యములనుబట్టియే ఫలితముండును. "ఏది విత్తుదువో అదే కోయుదువు" అను సామెత సార్వకాలికము. సార్వదేశికము. కారణమును బట్టియే కార్యముండును. మనము మన దురభ్యాసములను, దుర్గుణములను దూరమొనరించుకొని వాటి స్థానమున సదభ్యాసములను, సద్గుణములను అలవఱచుకొనగలము. మనల మనమే ఉద్ధరించుకొనగలము, ఆత్మవిజయమందు అద్భుత శక్తి కలదు. ఆత్మసంయమముద్వారా మనము మన జీవితమును సంస్కరించుకొందుమేని మనకు అపారానందము కలుగగలదు.

ప్రతి మనుష్యుడు తన ఆలోచనలద్వారా పరిమిత జీవనము గడుపుచుండును. కాని అతడు తన ఆలోచనల పరిమితిని విస్తరింప జేసుకొనగలడు. అప్పుడాతని జీవన స్థాయి పెంపొందగలదు. అతడు తన నింద్యకుత్సితాలోచనలను త్యజించి ఉత్తమాలోచనలను స్వీకరింపగలడు. అతడు అధోగతినుండి ఊర్ధ్వగతికి ప్రాపించగలడు. అప్పుడాతనిశక్తి సామర్థ్యములు పెంపొందగలవు. అతని ప్రవర్తన ప్రకాశవంతమయి పరిసరముల ప్రభావితము గావించు
ను.

ష్యుడు తన ఆలోచనల కనుగుణముగనే అధ
ఉత్తముడుగనో రూపొందుచుండును. అతని
సంకుచితములగుచో ప్రపంచమంతయు
ముగనే కనబడును. అతని ఆలోచనలు
చో ప్రపంచమంతయు అతనికి వ్యాకో

చముగానే కన్పించును. మనుష్యుని చుట్టు ప్రక్కలగల ప్రతి వస్తువుమీద ఆతని ఆలోచనల ప్రభావము ప్రసరించు చుండును.

ఇప్పుడొక వ్యక్తినిగూర్చి ఆలోచింతము. ఆతడు సంశయాత్ముడు. లోభి; అసూయాపరుడు. ఆతనికి ప్రపంచ మందలి ప్రతివస్తువు సంశయాత్మకముగ కనబడుచుండును. ఆతనిలో ఔదార్యముండదు. కనుక ఆతనికేవస్తువునందును సుగుణము కాన్పించదు వేయేల ఆతనికి ఉత్తమోత్తమ స్వార్థరహిత పరమాద్భుత పరోపకార కార్యమందును స్వార్థపరతయే కానవచ్చు చుండును.

ఇపుడొక వ్యక్తినిగూర్చి తెలుసుకొందము. ఈతడు సంశయరహితుడు, ఉదారుడు, ఉన్నతాలోచనా సంపన్నుడు. ఈతడు ప్రతి ప్రాణియందు సత్యసంధతనే సందర్శించు చుండును. నీచమానవులు మొట్టమొదట ఈతని దర్శింప తడబడుదురు. పిమ్మట నిలద్రొక్కుకొని, ఈ సాంగత్య ప్రభావమున ఉదారాలోచనాసంపన్నులై సుఖము, శాంతి ననుభవింపగలరు.

భిన్నభిన్న స్వభావులగు ఈ ఇరువురు వ్యక్తులు ఇరుగుపొరుగున నివసించుచున్నను వీరి ఆలోచనలు, ఆదర్శములు, ఆచరణ పద్ధతులు వేరువేరుగనేయుండును. వీరి స్వభావములు, కార్యపద్ధతులు కలియనేరవు. వీరి నైతిక దృక్పథము సయితము ఒకేరీతిగ నుండదు. వీరుభయు

లలో ఒక వ్యక్తి నరకయాతన ననుభవించుచుండును. రెండవ వ్యక్తి స్వర్గసౌఖ్యము ననుభవింపగలడు. వీరిలో మొదటి వ్యక్తి ఇతరులను మోసగించుచుండును. లోకుల కొల్లగొట్ట జూచుచుండును. అందువలన ఆతడు ఇతరులు కూడ తనవంటి స్వభావులుగనే ఉందురని తలంచి ఆత్మ రక్షణము నకు తనవద్ద తుపాకి నుంచుకొనును. రెండవ వ్యక్తి సమస్తజనులను ప్రేమించుచుండును. ఎల్లరను ఆప్యాయతతో ఆదరముగ ఆహ్వానించుచుండును. అందుచే ఆతనిచెంత సదా సత్యసంధులే సచ్చారిత్రులే సమావేశమయి యుందురు. వారందఱు వానితో ఏకీభవింతురు. వానితో కలిసిమెలసి పోయెదరు. ఆతని సాంగత్య ప్రభావమున వారందఱు ఉత్తములగుదురు ఆతని హృదయము నుండి ప్రేమవాహిని పొంగిపొరలుచుండును. కనుక సహచరులందఱు ఆతనిని ప్రాణాధిక ప్రియునిగ ప్రేమించుచుందురు. ఆతనిని మిక్కిలి గౌరవించుచుందురు.

సంఘములో ఈ భిన్నత్వము ఎందుకు ఏర్పడినది? మానవుల ఆచారములు ఆలోచనలు భిన్నభిన్నములుగ నుండును గనుక వీటి ప్రభావము మానవ సమాజముపయి పడుచుండును. తత్ఫలితముగ మానవులు భిన్నభిన్న వర్గములుగ చీలిపోవుచున్నారు. శ్రమజీవులు బుద్ధిజీవులయి ధ్వజమెత్తుచున్నారు. కాని వారు ఈ భిన్నత్వమును తొలగింపలేరు. ఏ కృత్రిమోపాయములద్వారా సమతను స్థాపించలేరు. మానవసమాజములో ఆలోచనాసామ్యము భావసారూప్యత ఏర్పడినపుడే మానవులలో సమత సాధ్య

మగును. ఆధునికయుగమున మనుష్యులలో ఆర్థికముగ, సాంఘికముగ ఏర్పడియున్న ఈ హెచ్చు లొచ్చులను నిర్మూలించుటకనేకవిధోపాయములు ఆలోచించుచున్నారు. కాని మనుష్యుల మనస్సులలో, వారి ఆలోచనలలో హెచ్చుతగ్గు భేదములను తొలగించనంతవఱకు ఈ అసమానత అంతమొందదు. అనగా మానవుల మనస్సులలో, ఆలోచనలలో మార్పుతీసుకొనిరావలెను. అప్పుడే మానవ సంఘమునగల హెచ్చులొచ్చులు నశించి సమ సమాజము సాధ్యమగును. ప్రభుత్వ శాసనముల గౌరవించువారు, వాటిని ఉల్లంఘించువారు - వీరుభయులు సహజముగ భిన్నస్వభావులుగా నుందురు. వారి యీ భిన్నత్వమునకు వారి దర్పాహంకారములుగాని, ఈర్ష్యాద్వేషములు గాని కారణముగాదు. వారి యీ భిన్నత్వమునకు వారి ఆలోచనలే, ఆచార వ్యవహారములే, కార్యపద్ధతులే కారణములు. హింసవలన స్వర్గ రాజ్యము ప్రాప్తించదు. అది దాని సిద్ధాంతము ననుసరించి తన చరిత్రను రూపొందించుకొనినవానికే లభించగలదు.

ప్రతిమానవుడు తన పరిమిత లేక విశాల భావనా ప్రపంచ పరిధి ననుసరించియే కార్యమాచరించుచుండును. మానవుని బడిపిల్లలతో పోల్చవచ్చును విద్యార్థి తన యోగ్యతనుబట్టియే తనకు తగిన తరగతిలో చేరుచున్నాడు. సరిగా ఇదేవిధముగా మానవుడు తన యోగ్యతనుబట్టియే సంఘమున స్థానమును సంపాదింపగలడు. ప్రాథమిక పాఠశాలా విద్యార్థి ఉన్నత విద్యాలయ పాఠ్యక్రమమును

అర్థము చేసుకొనలేడు. అతనికది అగోచరముగా
నుండగలదు. కాని అతని బుద్ధి వికసించినకొలది, యోగ్యత
పెంపొందినకొలది అతడు దానిని అర్థము చేసుకొనగలడు.
అపుడాతడువరుసగ అన్ని తరగతులలో ఉత్తీర్ణుడగును.
మానవజీవితము విద్యార్థి జీవితమునే పోలియున్నది.
ఈ రీతిగనే స్వార్థపరులు, క్షుద్రస్వభావులు, సంకుచిత
చిత్తులు సయితము తమ సత్సంకల్పములద్వారా, సదా
లోచనలద్వారా తమ క్షుద్రస్వభావమును త్యజింతురేని,
తమ స్వార్థమును విడనాడుదురేని, కోపమును జయింతు
రేని, తమ నైతిక స్థాయిని పెంపొందించుకొందురేని
మహాపురుషులయి ప్రపంచములోని పాపమును ప్రక్షాళన
జేసి మానవలోకమునకు చిరస్మరణీయులగుదురు.

మానవుడు తన మంచిచెడ్డ ఆలోచనలనుబట్టియే
పవిత్రుడో, పతితుడో అగును. ఇది ప్రకృతి నియమము.
ప్రతి మానవుడు స్వీయాలోచనా పరిధిలోనే పరిభ్రమించు
చుండును. అదియే అతని ప్రపంచము. ఆ ప్రపంచములోనే
అతని అలవాట్లు ఏర్పడుచుండును. అతడందే తన్మయు
డయి ఆనంద మనుభవించుచుండును. కాని సంకుచిత
చిత్తుడు, పతితమానవుడు శాశ్వతముగ తన జీవితకాల
పర్యంతము తన సంకుచిత పతితావస్థలోనే పడియుండ
వలయునని ఎక్కడను వ్రాసిపెట్టబడలేదు. ఏ ప్రవక్తయు
అట్లు చెప్పియుండలేదు. మనుష్యుడు వాంఛించునేని తన
ఆలోచనలను, భావములను ఉన్నతములుగ, ఉదారములుగ

సంపాదించుకొని ఊర్ధ్వగతిని ప్రాపించి సుఖమనుభవింప గలడు. ఆతడుత్తముడగుటకు స్థిరసంకల్పుడయినంతనే ఆతని సంకుచిత స్వార్థబంధములు తుత్తునియలయిపోగలవు. అప్పుడాతడు విశాలోన్నత పవిత్ర ప్రపంచమున విహరింప గలడు. అప్పుడాతని జీవితము సార్థకమయి, సుఖసౌభాగ్యోపేతమయి ప్రకాశింపగలదు.

“మన దుఃఖములకు మనమే బాధ్యులము. ఇంకెవ్వరునుగారు. కార్యరూప ఫలమును మనమే. కారణమును మనమే. అందువలననే మనము స్వతంత్రులమనుట. నేను దుఃఖినైనయెడల ఆ దుఃఖము నేను తెచ్చిపెట్టుకొనినదే. నేను తలచుకొనినయెడల సుఖవంతుడనుగా మారగలననుటకు రుజావును అదియే నరుని ఇచ్ఛాశక్తి పరిస్థితులన్నింటికిని అతీతమయి పరగుచున్నది. అనగా నరునందుగల బలిష్ఠమును మహత్తరమును, అఖండమును నగు చ్ఛా స్వాతంత్ర్యములుమెనుట ప్రకృతియు జోహారులనవలసినదే. తలవంచి దాస్యము చేయవలసినదే. కర్మసూత్రముయొక్క మహిమ యిట్టిదే సు !

—స్వామి వివేకానంద.

సోదరా ! నీ అదృష్టమునకు నీవే కర్తవు. నీవెన్నడును నేను దీనుడను, హీనుడను, దురదృష్టవంతుడనుకొనవద్దు. నిన్ను నీవు పరమాత్మ స్వరూపుడవను కొనుము. నేను స్వతంత్రుడను, ముక్తుడను అనుకొందువేని

స్వతంత్రుడవు, ముక్తుడవు అగుదువు. సమస్త శక్తులు, సమస్త సంపదలు నీలోనే కలవు.

నీవు ఎటువంటి ఆలోచనల చేయుదువో, అటువంటి వాడవే అగుదువు.

నిన్ను నీవు పాపాత్మునిగ అనుకొందువేని పాపాత్ముడ వగుదువు మూర్ఖుడవనుకొందువేని మూర్ఖుడ వగుదువు. దుర్బలుడ వనుకొందువేని దుర్బలుడ వగుదువు. అవుడు ఈ ప్రపంచములో ఏశక్తియు నిన్ను బలాఢ్యుని జేయజాలదు.

—రామతీర్థ.

# బాహ్య ప్రపంచము

మనుష్యునిపయి (మనపై) సాంగత్య ప్రభావము పడుచుండును మన మెట్టి సాంగత్యము చేయుదుమో అట్టి వారమే యగుదుము. సత్సహవాసముచే సజ్జనుల మగుదుము. దుస్సాంగత్యముచే దుర్జనుల మగుదుము. మానవుడు తన పరిసరములకు అతీతముగ మనజాలడు. ఏ సంఘమున మానవుడు నిత్యము నివసించుచుండునో ఆ సంఘములో ఆతడు ఒక భాగమనుట (ఒకడనుట) నిస్సంశయము. అట్లగుట ఆతడు తన యిరుగు పొరుగువారినుండి, తన సహచరులనుండి వేరుగ ప్రవర్తింపజాలడు. ఆతడు వారి ఆలోచనల ద్వారా వారిచే బంధింపబడి యుండును. మనుష్యుడు తన అభీష్టానుసారము బాహ్యప్రపంచమును మార్చజాలడు. కాని ఆతడు పిచ్చికోరికలను మార్చుకొని బాహ్యప్రపంచమున కనుకూలుడు కాగలడు. ఆతడు సంఘమును మార్చజాలడు. కాని ఆతడు సంఘమున కనుకూలముగ ప్రవర్తింపగలడు. ఆతడు పరిస్థితులను మార్చజాలడు. కాని పరిస్థితుల కనుకూలముగ కార్యమాచరింపగలడు. ఆతడు తన మనోవికాసముద్వారా చతురమతియయి పరిస్థితుల నెదుర్కొను మార్గమును కనుగొనగలడు. పరిస్థితులు ఆలోచనల ననుగమించుచుండును. ఆతడు తన ఆలోచనలను మార్చుకొనునేని పరిస్థితులును మారగలవు. అద్దములో నీ ముఖము చక్కగ కనబడవలయునన్న అద్దము శుభ్రముగ నుండవలెను. అద్దముమీద దుమ్ము పేరుకొని

యున్నచో నీ ముఖము సరిగ కనబడకు సరిగదా అతి వికృతముగ, విపరీతముగ కనబడగలదు. ఈ విధముగనే ప్రశాంత మనస్సునకు ప్రపంచమంతయు ప్రశాంతముగ కనబడగలదు. మనస్సును జయించుము. దాని ప్రశాంతముగ, సుందరముగ, ఆనందధామముగ కనబడగలదు.

మానవుని మనస్సులో అపారమైన అద్భుతశక్తి నిక్షిప్తమయి యున్నది. ఆ శక్తి సాహాయ్యమున ఆతడు పవిత్రుడు, పరిపూర్ణుడు కాగలడు.

కాని ఆతడు అన్యులను పవిత్రులుగ, పరిపూర్ణులుగ జేయజాలడు. ఏలననగా వారిపయివాని ప్రభావము పరిమితముగ నుండగలదు. మనుష్యుడు తనను మాత్రము తన యిచ్ఛవచ్చిన చొప్పున మార్చుకొనగలడు. కాని అన్యుని మార్చుటలో ఆతనిశక్తి పరిమితముగ పనిచేయును. మనుష్యుడు ఒకేరకపు లక్షలకొలది వ్యక్తులలో ఒకవ్యక్తిగ తన మనుగడ సాగించుకొనుచుండుట మనము ప్రత్యక్షముగ ప్రతిదినము చూచుచున్నాము. ఈ వ్యక్తులు ఎవరంతట వారు స్వతంత్రముగ తమ యిచ్ఛవచ్చినట్లు వ్యవహరింప జాలరనుట అనుభవైక వేద్యమే. వారు తమసాటి మానవుల ఆలోచనలను, అభిప్రాయములను గౌరవింప బాధ్యులగుచున్నారు. వారు తమ నిత్య కార్యకలాపములలో పరస్పరము సహకరించుకొనుచు సహజీవనము కొనసాగించుకొనవలసిన వారగుచున్నారు. సంఘములోని ఒక వ్యక్తి

వలన జనులు తమకు నష్టము, కష్టము కలుగునని భావింతు
రేని అతనికి వారు దూరముగా తొలగిపోయెదరు. ఆవ్యక్తి
వలన హాని సంభవింపకుండ ఆత్మరక్షణోపాయముల నవలం
బింతురు. మనుష్యులు తమకు కలరా, మశూచికము
మున్నగు అంటు వ్యాధులు సంభవించినపుడు మందుల
ద్వారా వాటి విషక్రిములను అంతమొందించు కొనునట్లు
మానవసమాజము తనలోని దుశ్చరిత్రులను దూరము
గావించుకొనును. ఆదుశ్చరిత్రులు తమ అకార్యకర
ణములద్వారా సంఘమను శరీరమును గాయపఱతురు.
దుష్టులను సంఘము బహిష్కరించినపుడు వారు మిక్కిలి
బాధపడుదురు. కాని సంఘమను శరీరము స్వస్థమయి సుఖ
మనుభవింపగలదు. ఏకార్యమును సంఘమునకు అతీతముగ
నుండజాలదు. నీవే కార్యమునయిన ఎంతరహస్యముగ
జేసినను దాని ఫలితము బహిర్గతముకాక మానదు. ప్రతి
మానవునకొక జీవన గ్రంథముండును. అందు ఆతడాచరించు
ప్రతికార్యము రికార్డుచేసి యుంచబడును. దానిపయి విచా
రణ జరుపబడును. కనుక సంఘములో ఒకవ్యక్తి చేయుపనులు
వాని వఱకే పరిమితములయి యుండవు.

అవి సర్వప్రపంచమునకును వర్తింపగలవు. అనగా
ఆతని కార్యముల ఫలితము ఆతడొక్కడే అనుభవించునని
తలపోయరాదు. ఆ ఫలితము సంఘమంతయు అనుభవింప
గలదు. మనుష్యుడు తాను చేయు దుష్కర్మల ఫలిత
ములు ననుభవింపకుండ తప్పించుకొనజాలడు. కాని ఆతడు
దుష్కర్మలజేయ ప్రేరేపించు ఆలోచనలను త్యజించి

వాటివలన కలుగు ఫలితములనుండి తప్పించుకొనగలడు. కనుకనే మానవులు తమ చెడ్డ ఆలోచనలను మానుకొని మంచి ఆలోచనలద్వారా మంచిపనులుచేయుట కలవాటు పడవలెను. ఇది మానవుని ముఖ్య కర్తవ్యము. అప్పుడే అతడు సుఖపడగలడు. తత్ఫలితముగా సంఘమును సుఖ పడగలదు.

నీవు బాహ్యజగత్తును మార్చలేవుకాని దానినుండి నీకు హాని సంభవింపకుండ నడచుకొనగలవు. నీ బంధ హేతువులకు మూలకారణము నీ అంతరంగమందే కలదు. అన్యులు నీ కపకారము గావించుచున్నారనిన దానికి దోషివి నీవే. నీ కర్మల ఫలితముగానే వారు నీ కపకారము గావింప వివశులగుచున్నారు. బాహ్యపరిస్థితులు నిమిత్తమాత్రములే. కారణభూతుడవు నీవే. నీ దుష్కర్మలే నీకు హాని కలుగజేయుచున్నవి. నీ సత్కర్మల మూలముననే నీ సౌభాగ్యము నిర్మాణమగుచున్నది. మనుష్యుడు తానుచేయు మంచి చెడ్డ పనులవలననే మంచి చెడ్డ ఫలితములు అనుభవించుచున్నాడు. ధార్మిక పురుషుని కెవరును హానిగావింపజాలరు. అతడు ఎల్లప్పుడు ప్రశాంతముగా కాలము గడుపుచుండును. అతడు సమస్త జనుల శ్రేయస్సును కాంక్షించుచుండును. అందుచే ఎవరును అతనికపకారము గావింప నుంకింపరు. ఒకవేళ ఎవడేని అతనికి కపకారముగావింప నుపక్రమించునేని తుదకాతడే నష్టపడగలడు. అతడు నిరంతరము పరులకుపకారము

గావించుచుండును. అందుచే అతడు నిత్యము సుఖము
శాంతి ననుభవించుచుండును. ఆతని సమస్త కార్యకలా
పమునకు ఆతని సత్సంకల్పమే, సచ్చారిత్రమే మూలహే
తువు. వాటి ఫలితము సుఖము, మఱి శాంతియనుట
నిక్కము.

సంఘములో ఒకవ్యక్తి మఱొక వ్యక్తిపయి అప
వాదు వేసిన అతనికి సంఘములో అప్రతిష్ఠ కలుగునని తలం
చును కాని వాని యీ తలంపు సరియయినది కాదు. ఒకవ్యక్తి
ఏ వ్యక్తిని అపఖ్యాతిపాలు గావింప గోరునో ఆతనిని అప
ఖ్యాతిపాలు చేయలేకపోగా తుదకు తానే అపఖ్యాతిపాల
గును. చెడ్డవాడే మఱొకనిని చెడ్డవాడనును. చెడ్డవాడే
ఇతరులపయి అపనిందలువేసి తన చెడుగును కప్పిపుచ్చు
కొనుటకు తాను నిర్దోషినని పించుకొనుటకొరకు అనేక అబద్ధము
లాడును. ఆతడు అసత్యమును సత్యముగ చిత్రింప ప్రయ
త్నించును వట్టి అపనిందలవలన సజ్జనుడు వ్యాకుల చిత్తుడు
గాడు. ఇట్టి దోషదూషిత వాతావరణమునకు ఆతడు
దూరముగ నుండును. అందుచే సజ్జనుడు తనపయి వేయ
బడు అభాండముల లక్ష్యపెట్టడు. వాటికతడు లొంగడు,
బెణకడు. అందువలన వాటి ప్రభావము వానిపయి ఏమాత్ర
మును పడదు: మూర్ఖుడెవడేని సూర్యునిపయి రాయి విసరు
నేని అది సూర్యుని ఏమియు చేయజాలదు. ఆ రాయి తిరిగి
వచ్చి వానిమీదనే పడును. ఈ రీతిగనే సజ్జనునిపయి
వేయు అభాండములు వానినేమియు చేయజాలవు. బుద్ధభగ

వానుడు నిత్యము తన శిష్యులకిట్లు ప్రబోధించుచుండు వాడు :-మీలో ఎవరేని వాడు నన్ను తిట్టినాడు, వీడు నన్ను కొట్టినాడు, ఫలానివ్యక్తి నన్ను అవమానించినాడు మఱి మోసగించినాడు నాకు హాని గావించినాడు" అని తలంచెదరేని మీకు సత్యసాక్షాత్కారము కలుగనేరదు. మీ ఆత్మోన్నతి ఆగిపోవును.

పరిసరములుగాని, పరిస్థితులుగాని వాటంతట అవి మంచివిగావు. చెడ్డవియుగావు. మన మనోభావమునుబట్టియే అవి మనకు మంచివిగనో, చెడ్డవిగనో, అనుకూలములు గానో, ప్రతికూలములుగానో కనబడుచుండును. మను ష్యులు సామాన్యముగా ఇట్లు తలంచుచుందురు. "నాకు పరిస్థితులు అనుకూలించి యుండినచో, నావద్ద తగినంత ధనముండియున్నచో, నాకు పెద్దలవాక్ సహాయము లభించి యుండియున్నచో, నాకు చాలినంత కాలవ్యవధి లభించి యుండినచో, తగినంత స్వేచ్ఛయుండియున్నచో కుటుంబ మందలి జగడములు, జంజాటములు లేకుండినచో నేను ప్రపంచమున అనేక ఘన కార్యములను సాధించియుండెడి వాడను." అతని యీ తలంపు సరియైనదికాదు. వాస్తవము నకు మానవుని ఘనకార్యముల జేయకుండ ఆటంకపఱచు నవి ఇట్టి శుష్క ప్రసంగముల జేయ ప్రేరేపించువాని దుర్బ లాలోచనలే. వాని మనోదౌర్బల్యమే అనుట సమంజసము. పైనుదహరించిన కారణములు స్వయంశక్తి సంజనితములు కానేకావు. మనుష్యుడు తన మనస్సులో వాటికి స్వతః

లేనిశక్తిని వాటికాపాదించి దీనుడు, హీనుడు, దయనీయుడు అగుచున్నాడు. మానవుడు తన మనోదౌర్బల్యమునకు, జీవన యుద్ధక్షేత్రమున తనకు కలుగు అపజయమునకు తన అంత. రంగమున ఇట్టిభావనకు స్థానమిచ్చుటయే కారణమనిభావించుటలేదు. ఇదివాని స్వభావదౌర్బల్యము మీదు మిక్కిలి తన యీస్వభావ దౌర్బల్యమును నిందించుటకు మారుగ తన అపజయమునకు బాహ్యపరిస్థితులు, కాలకర్మలు, అదృష్టాదృష్టములు కారణభూతములని తలంచి వాటిపయి నిందమోపు చున్నాడు.

దృఢనిశ్చయము, సంకల్ప ద్రఢిమ లేకపోవుటయే మానవుని దౌర్బల్యములోనికెల్ల నికృష్ట దౌర్బల్యము మానవుడు జీవనసంగ్రామ రంగమున తా నెదుర్కొను ప్రతికూల పరిస్థితులను, ప్రతిబంధకములను ప్రబల విరోధకములుగ భావింపక వాటిని కార్యోత్సాహ వర్ధకములగు అనుకూల పరిస్థితులుగ భావించునేని ఆతని జీవనపథమున అడ్డగనిలిచిన ఆ ఆటంకములను, అవరోధములను పౌరుష ప్రతాపములతో నెదుర్కొని అవలీలగ వాటిపయి విజయము సాధింప సన్నద్ధుడగును. అపుడతడు ప్రతికూల పరిస్థితులను ప్రతిరోధించి సఫలతను సంప్రాప్తిజేసుకొనుటకనువగు నూతన మార్గముల నన్వేషింప నారంభించును. ఆవశ్యకత ఆవిష్కరణమునకు జనని (ఆధారభూతము) దీనిని జ్ఞాపకముంచుకొని నడచునేని మానవుని జీవనపథము నిష్కంటకమగును. అప్పుడు ప్రతికూల పరిస్థితులు, ప్రతి

క్రోధములు ప్రబల సహాయకములుగా పరిణమింపగలవు. అపు డతడు నూతనోత్సాహ సంభరిత స్వాంతుడగును.

వాస్తవమునకు మానవుడే సమస్తమునకు కర్త, భర్త, హర్త. నీ ఉన్నతికి నీవే సర్వసమర్థుడవు. ఏకైక కారణ భూతుడవు, మానవుడు. ఏకాగ్ర చిత్తుడై తన సర్వ శక్తియుక్తులను తన కార్యము పయి కేంద్రీకరించినచో ఆతడు ప్రతికూల పరిస్థితుల నిందింపక వాని నెదుర్కొనుటకు బద్ధుడయి మేరునగధీరుడయి నిలబడగలడు. ఏ వ్యక్తి పరిస్థితులను నిందించునో ఆతడు మానవ శక్తిని గూర్చి ఆలోచించని వాడని తలంచ వచ్చును.

ఆతడు దానిని అనగా మానవశక్తిని ఇంత వఱకు ఉపయోగించుకొనని వాడని భావింపవచ్చును, మానవుడు తన సంపూర్ణశక్తిని తన మనస్సులో సంచరింప జేసుకొన నంతవఱకు, పరిస్థితులపయి విజయము సాధించనంతవఱకు ఆవశ్యకతలు ఆతనిని బాధించు చుండగలవు. ఆవశ్యకతలు పరాక్రమ వంతుని జీవన పథమున పురోగమింప ప్రోత్సహించుచుండగలవు. అపు డాతడు తన వివేకము, దూర దృష్టిద్వారా ప్రతికూల పరిస్థితులను తన కనుకూలములుగ మార్చుకొనగలడు.

ఇంతయేల పరిస్థితులగూర్చి మొరపెట్టు మానవుడు మానవుడుగ మనుగడ సాగింపనర్హుడు గాడు. పరిస్థితులు దుర్బల మానవులపయి దండయాత్ర చేసి వారిని ఓడించ

గలవు. ధీరోదాత్తునకవి విధేయసేవకులయి చేతులు జోడించుకొని యెదుట నిలబడగలవు.

మనల బంధించునవి బాహ్యవిషయాలు గావు. మన బంధమోక్షములకు మన ఆలోచనలే మూలకారణములు. మనల బంధించుకొన మనమే మన సంకెళ్ళను స్వయముగా నిర్మించుకొనుచున్నాము. మన ఆలోచనలే మన సంకెళ్ళను తుత్తునియలు గావించి మనల బంధవిముక్తుల జేయగలవు. ఈ ఆలోచనలద్వారానే మనము రమణీయ రాజభవనములు నిర్మించుకొని అందు సుఖముగ, స్వేచ్ఛగ ప్రశాంతముగా నివసింపగలము. కాని యీ ఆలోచనా పరివర్తనమునకు వజ్రసంకల్పము, అకుంఠిత దీక్ష అవసరములు. మనుష్యుడు తన పరిస్థితులు ప్రబల బలవత్తరములని తలంచుచు, వాని నధిగమించుట అసంభవమని తలపోయుచో పరతంత్రుడయి ఆపరిస్థితులచేత బంధింపబడి యుండును. అట్లుగాక ఆతడు పరిస్థితులను ఎదుర్కొని వానిని జయింప వజ్రసంకల్పుడగునేని పరిస్థితులపయి ప్రభుత నెఱప దీక్షాకంకణధారి యగునేని స్వతంత్రుడయి, ఉన్నత ఉత్తమ పథానుగామి యగును.

ప్రతి మనుష్యుడు తన ఆలోచనలయెడ జాగరూకుడయి యుండవలెను. తన ఆలోచనలు తనను స్వాతంత్ర్యము దెసకు గొనిపోవుచున్నవో లేక పారతంత్ర్యము వైపునకు లాగుచున్నవో ఆలోచించుకొనుచుండవలెను తన ఆలోచనలు ఊర్ధ్వగతికి మూలములగుచున్నవో లేక

అధోగతికి కారణములగుచున్నవో గమనించుచుండవలెను. ఏ ఆలోచనలు ఆతనిని పరిస్థితులకు బానిసగ జేయు చున్నవో వాటిని త్యజింపవలెను. ఏ ఆలోచనలు ఆతనిని పరిస్థితులకు దాసునిగా జేయువో వాటిని స్వీకరింప బద్ధ కంకణుడుగావలెను.

"నీ వేదికాగోరిన అది కాగలవు. నీవు దీనుడవు అనుకొనిన దీనుడవే అగుదువు. బలాఢ్యుడను అనుకొనిన యెడల బలాఢ్యుడవే కాగలవు నీవు పాపివి అనుకొనినచో పాపివి అగుదువు పుణ్యశాలి ననుకొంటివా పుణ్యశాలి నగుదువు. బలాఢ్యులము, సర్వశక్తిమంతులము, సర్వజ్ఞు లము అని మనము సంకల్పము చేయవలయును. ఆ శక్తి యంతయు ఇపుడు నాయందు ప్రకాశమునకు వచ్చి యుండక పోవచ్చును. కాని అది నాయందున్నది. సమస్త జ్ఞానమును నాయందున్నది. సర్వశక్తియు నాయందున్నది.

— స్వామి వివేకానంద

# అలవాట్లు

మానవుడు అలవాటునకు దాసుడు. అతని అలవాటు ఎట్లుండునో అతని పనియు అట్లేయుండును. అట్టి దశ మనుష్యుని స్వతంత్రుడనవచ్చునా? నిస్సందేహముగా మానవుడు స్వతంత్రుడే. స్వతంత్రుడే కాదు సర్వస్వతంత్రుడు. మానవుడు జీవనము జీవన సూత్రములను సృజించ లేదు. జీవనము, జీవనసూత్రములు అనాది సిద్ధములు. మానవుడు వాటికి లోబడియుండును. కాని వాటిని అర్థము చేసుకొని వాటిననుసరించి నడచుకొనగలడు. జీవన సూత్ర నిర్మాణము మానవశక్తికతీతము. కాని అతడు తన వివేకముద్వారా ఆ సూత్రములలో తన కనుకూలమయినవి, శ్రేయస్కరమయినవి ఎన్నుకొని వాటిని ఆచరణలో పెట్ట గలడు. మానవుడు సృష్టికి ఆధారభూతములగు నియమము లను అన్వేషించి కనుగొనగలడు. కాని వాటిని నిర్మించ లేదు.

ఆ జీవన సూత్రముల గురించి తెలిసికొననిచో మనుష్యుడు ధుఃఖభాజనుడగును. వాటి నుల్లంఘించినచో వాడు మూర్ఖుడు, మరి పరతంత్రుడునగును. రాజ్యశాస నముల నుల్లంఘించు చోరుడు స్వతంత్రుడా? వాటిని పాలించు సత్పౌరుడు స్వతంత్రుడా? వీరుభయులలో ఏ వ్యక్తి మిక్కిలి స్వతంత్రుడు, ఈ చందముననే సంఘ ములో నీతి నియమముల ద్యజించి తన యిచ్చవచ్చిన

మచ్చిన విచ్చలవిడిగ చరించు వ్యక్తి స్వతంత్రుడా ! వివేకవంతుడయి, సన్మార్గావలంబియయి, సత్కార్యాచరణ పరాయణుడయి మనుగడ సాగించు బుద్ధిమంతుడు స్వతంత్రుడా ? ఈ ఉభయులలో ఏ వ్యక్తి మిక్కిలి స్వతంత్రుడు ? సౌఖ్యవంతుడు ?

మనుష్యుడు పుట్టుకతోనే కొన్ని స్వభావములతో భువి నవతరించు చున్నాడు. ఈ ప్రాకృతిక నియమముల నుల్లంఘు నీయము కానిఅతడు తన స్వభావమును మార్చుకొనగలడు, మానవుడు భూమ్యాకర్షణ శక్తిని తొలగింపజాలడు. కాని పక్షులు దానికి లొంగి సలాము చేయు చున్నారు. దాని నుపయోగించుకొను చున్నారు. దానిని ఉపేక్షించనూ లేరు. తిరస్కరించనూ లేరు. మనుష్యుడు. గోడలతో ఢీకొని తన తల పగులగొట్టుకొనడు. ఏ కందకములోనో దుమికి తన మృత్యువును కొని తెచ్చుకొనడు. వాటిని తప్పుకొని నడవకున్నచో వానికి మరణం తప్పదు. దీని నెవరును తప్పించజాలరు. ప్రకృతి ధర్మములు తమ పని చేసుకొని పోవుచునే యుండును. అందువలన మానవుడు సావధానచిత్తుడయి గోడతో ఢీకొనకుండ, కందకములో పడకుండ వాటి ప్రక్క ప్రక్కన నడచుచుండును. ఈవిధముగానే మనుష్యుడు జీవన సూత్రములను పాటించవలెను. వాటి ననుసరించి నడచుకొనవలెను.

భూమ్యాకర్షణశక్తి నియమాలవలెనే ప్రకృతి నిర్మిత అభ్యాససూత్రముల కధీనుడు. కాని అతడు చతుర

మరియు దానిని తనకనుకూలముగ నుపయోగించుకొను
టయో, అజ్ఞానము వలన దాని నుపయోగించుకొనలేక పోవు
టయో జరుగుచున్నది. దీని సారాంశమేమనగా ! మను
ష్యుడు తన అలవాటునుబట్టియే ఏదేని పని చేయుచుండును.
అది మంచిపని కావచ్చును, చెడ్డపని కావచ్చును. ఈ
విషయములో ఆతడు వివేకి కావచ్చును. అవివేకి
కావచ్చును. అగ్నిగుండములో దుముకవచ్చును. లేదా దాని
నార్పవచ్చును. నీటిలోమునగవచ్చును లేదా దానిపయి
వంతెనకట్టి దానిని దాటవచ్చును. సత్కార్యము చేయుట అగ్నిని
ఆర్పుటవంటిది. వంతెనకట్టుట వంటిది. అసత్కార్యములు
చేయుట అగ్నిలోదుముకుటవంటిది. పుటి నూతిలోపడుట
వంటిది. వైజ్ఞానికులు ఆవిష్కర్తలు తమ పరీక్షా పరిశోధ
నల ఫలితముగ ప్రకృతి శక్తులను, వాటి సూత్రములను
చక్కగ తెలిసికొని వానిని ఉచితరీతి నుపయోగించుకొను
చున్నారు. ఈరీతిగానే వివేకి ధార్మిక నీతినియమములను
తెలుసుకొని వానిని ఉచితరీతిని నుపయోగించుకొని వాటి
వలన ప్రయోజనము పొందుచున్నాడు.

మూర్ఖుడు తన చెడ్డ అలవాట్లకు బానిసయయి పోవు
చుండ వివేకి వాటి తత్త్వము తెలిసికొని వాని నుచితరీతి
నుపయోగించుకొనుచున్నాడు. అపుడవి అతనిని సన్మార్గా
వలంబిగ జేయుగలవు. ఎవని ఆలోచనలు, అలవాట్లు,
చెయిదములు చెడ్డవో వాడు చెడ్డవాడనిపించుకొనును. ఎవని
ఆలోచనలు, అలవాట్లు, పనులు మంచివో వాడు మంచివా
డనిపించుకొనును. చెడ్డవాడు తన చెడ్డ అలవాట్లను, ఆలో

చనలను, పనులను మార్చుకొని మంచివాడు కాగలడు. ఆతడు అభ్యాస సూత్రమును మార్చలేడు కాని తన అలవాటును అభ్యాస సూత్రమున కనుకూలముగ మార్చుకొనగలడు. ఆతడు స్వార్థపూరిత వాంఛలను త్యజించి ధార్మిక నియమములను పాలింపగలడు. భోగవిలాసములను విసర్జించి సకలసాధు సుందర జీవితమును గడుపగలడు. అలవాటు మంచిది కానిమ్ము, చెడ్డది కానిమ్ము అది యథాతథముగ నుండును. ఆతడు దీనిని మార్చలేడు. కాని తన వివేక సాహాయ్యమున తన చెడ్డ అలవాట్లను మంచి అలవాట్లుగ మార్చుకొనగలడు.

ఒకే కార్యమును మాటిమాటికి చేయుదువేని అది అలవాటుగ మారిపోవును. మానవుడు నిరంతరము ఏ ఆలోచన చేయునో, ఏ కార్యమాచరించునో, ఏ అనుభూతికివశం వదుడగునో అట్టివాడే యగును. ఆతడు నిరంతరము వేనిని చింతించుచు, స్మరించుచు, ధ్యానించుచుండునో అవియే వాని చరిత్రలో లీనమయి వానిలో ఒక భాగమయి పోవును.

అప్పుడాతని మానసికస్థితి వాటికనుగుణముగా స్థిరపడి పోవును. మానసమందుదయించు ఆలోచనలు క్రమాభివృద్ధి నందుచుండగలవు. నేడు మనకు కనబడు మానవుడు తన గతసహస్రాలోచనల, కార్యముల పునరావృతముల పరిణామ స్వరూపుడు. ఆతడు అప్పటికప్పుడు అకస్మాత్తుగా ఆకసమునుండి ఊడిపడినవాడు కాడు. ఆతడు జన్మజన్మాం

తర సంస్కారములచే క్రమవికాసమునందుచు ఈ స్థితికి ప్రాపించినాడు ముందు ముందు మఱికొంత క్రమవికాసము నందుచు పోవుచుండగలడు. ఆతడు తన వర్తమాన చరిత్రను తన అభీష్టానుసారముగానే నిర్మించుకొనినాడు. ఆతడెట్టి ఆలోచనచేయునో, ఎట్టికర్మ నాచరించునో అట్టి వాడే యగును. ఆతని ఆలోచనలు, నిరంతరము కర్మలు అలవాట్లుగ మారుచుండగలవు. అలవాట్ల కనుగుణముగనే ఆతడు నిర్మాణమగుచున్నాడు. ఈ రీతిగ ప్రతిమానవుడు నిరంతరము తానుచేయు ఆలోచనలు, కార్యములచేతనే నిర్మాణమగుచుండుట మనము చూచుచున్నాము. ఆతడు ఏ ప్రత్యేక గుణములు అప్రయత్నముగ, సహజముగా కలిగియున్నాడో అవి దీర్ఘకాల చింతన, మనన ధ్యానాదుల పునరావృతములచే సంప్రాప్తమయినవి, కాని అప్పటికప్పుడే సంప్రాప్తమయినవిగావు. ఆ కారణముననే ఆతడు ఆలోచనలను, కార్యములను ప్రయత్నముతో నిమిత్తములేకయే స్వాభావికముగ జేయుచుండును. అప్పుడవి వాని సహజగుణములుగ, సహజ కర్మలుగ ఏర్పడి పోవుచున్నవి. కాలక్రమమున అవి సుస్థిరములయి వానిలో పాదుకొనిపోవుచున్నవి. ఒకవేళ ఎన్నడేని ఆతడు వాటిని త్యజింప నుద్యమించినను వాటినుండి ఆతడు విమోచనము నందలేడు.

అన్నిరకముల అలవాట్లు అవి మంచివికావచ్చును, చెడ్డవికావచ్చును. ఈ రీతిగ మానవునిలో పాదుకొనిపోవ ఆతడు వాటికి వశీభూతుడగుచున్నాడు ఒక వ్యక్తిలో

చెడ్డ అలవాటు పాడుకొని పోయినపుడు ఆతడు చెడ్డ అలవాటునకు బానిసీడు అయిపోయినాడందురు. ఆతని బుద్ధి భ్రష్టమయి పోయినదందురు. మంచిఅలవాట్లుగల వ్యక్తిని గురించి ప్రజలు ఆవ్యక్తి స్వభావ మెంత మంచిది, ఆతని అలవాట్లు ఎంత మంచివిఅని చెప్పుకొందురు.

మానవులందఱు తమ తమ అలవాట్లకు అధీనులయి యుందురు. వారిపుడే కాదు భవిష్యత్తులో సయితము యిట్లే అలవాట్లకు అధీనులయియుందురు. అవి మంచివి కావచ్చును- చెడ్డవి కావచ్చును. వారు ఏ ఆలోచనలను, ఏ కార్యములను మాటి మాటికి చేయుచుందురో వాటిచే ప్రభావితులయి వాటికి లోబడియుందురు. భూత భవిష్యద్వర్తమాన కాలములందును ఈ సూత్రము ప్రతి మానవునకు సమానముగ సరిపోగలదు. ఇది యెఱింగి బుద్ధిశాలి మంచి మంచి అలవాట్లను అలవఱచుకొని ఆనంద మనుభవింపగలడు. ఇపుడువానికి సుఖము, శాంతి, స్వాతంత్ర్యము కరతలామలకములగును. అతడే చెడ్డఅలవాట్లకు లోబడుచో దుఃఖదైన్యములను, పారతంత్ర్యమును అనుభవింపగలడు.

ఈ అభ్యాస సూత్రము మిక్కిలి ప్రయోజనకరమైనది. ఇది ఒకవంక చెడ్డ అలవాట్లకు అలవడిన వ్యక్తిని బంధితునిగావించి పరతంత్రు నొనరించుచున్నది. అపుడాతనిని దుఃఖములపాలు చేయుచున్నది. మఱొకవంక మంచి అలవాట్లుగల వ్యక్తికి ప్రయోజన కారియయి వానిని బంధవిముక్తుని జేసి సుఖశాంతుల ప్రసాదించుచున్నది.

సదభ్యాసముల కభ్యస్తుడయిన వ్యక్తి సత్కార్యముల అప్రయత్నముగ తనంతటతాను చేయుచున్నాడు.

అందువలన ఆతడు జీవితమంతయు సుఖమనుభవించు చున్నాడు. అలవాటుల కారణముగ మానవుడు అప్రయత్నముగ, సహజముగ జేయు కార్యములగాంచి కొందఱు అల వాటువలన మానవుడు అస్వతంత్రుడని, అశక్తుడు అగు చున్నాడని ఆతడు తన అభిరుచి, ఇష్టమునుబట్టి కార్య మాచరించు స్వేచ్ఛా స్వాతంత్ర్యములను గోల్పోవు చున్నాడని ఆతడు పుట్టుకతోనే మంచివాడుగనో, చెడ్డ వాడుగనో పుట్టుచున్నాడని ఆతడు ప్రకృతిచేతిలో కీలు బొమ్మ అని నుడువుచుందురు.

మనుష్యుడు తన ఆలోచనలచేత ఆడింపబడు ఆట బొమ్మ అనుమాట వాస్తవమే. ఆతనిపయి ఆతని ఆలోచ నల ప్రభావము పడుచుండుననుటయు సత్యమేకాని యీ ఆలోచనలు జడప్రాయములుగావు. ఆతడు సంకల్పించునేని తన ఆలోచనలను సరిక్రొత్త మార్గములకు మరల్పగలడు. ఆతడు వజ్రసంకల్పుడగునేని తన అలవాట్లను మార్చుకొన గలడు. ఆతడు పుట్టువుతోనే ఒక విశిష్టచరిత్రగలవాడయి జన్మించినాడనుటయు నిజమే. ఆ చరిత్ర ఆతని జన్మజన్మాం తర సంస్కార ఫలితమనుమాటయు తథ్యమే. ఆతడు సంక ల్పించునేని ఈ జన్మలో సయితము తన సంస్కారములను తన నూతనానుభవజనన జ్ఞానముద్వారా మార్చుకొన గలడు.

ఒకవ్యక్తి తన చెడ్డ అలవాట్లులేక దుర్గుణములవలన విసిగివేసారుగాక, ఆతడు తన చెడ్డ అలవాటులనుండి తప్పించుకొనజాలని నిస్సహాయస్థితిలో నుండుగాక, ఆతడు తన బుద్ధిద్వారా తన దురభ్యాసములను త్యజించి వాటి స్థానమున సదభ్యాసములను స్వీకరింపగలడు.

ఆతడు సదభ్యాసముల కభ్యస్తుడగునేని దురభ్యాసములవలె వాటిని త్యజింపగోరడు. ఏలననగా సదభ్యాసములవలన ఆతడు దుఃఖ దారిద్ర్య బంధవిముక్తుడయి నిరంతర సుఖసౌభాగ్యములతో తులతూగగలడు.

మానవుడు ఏ అలవాటును స్వయముగ తనకు తానయి అలవఱచుకొనెనో సంకల్పించునేని దానినాతడు త్యజించగలడు. లేదా తనకనుకూలముగ మార్చుకొనగలడు. చెడ్డ అలవాట్లవలన ఆనందము, హాయి లభించుచున్నంతవఱకు వాటినాతడు త్యజింప నిచ్ఛగింపడు. కాని ఆ దురభ్యాసములు దుఃఖప్రదములయి నిరంతరము వానిని చింతాకుల చిత్తుని గావించుచుండునేని వాటినుండి విముక్తి నందఁ బ్రయత్నించును. పిదప వాటిని త్యజించి వాటికి బదులుగ సదభ్యాసములను అలవరచుకొనగలడు.

ఈ జగతీ తలమున ఏ మానవుడును నిరంతరము దుఃఖ దారిద్ర్యబంధమున బడి నిస్సహాయుడయి నిర్వేదముతో క్రుంగి కృశించిపోనక్కఱలేదు. ఏ నియమ నిబంధనలచే మానవుడు తనను స్వయముగ బంధించుకొనెనో, ఆ నియమ నిబంధనలద్వారానే బంధమునుండి విమోచ

నము నందగలడు. ఆతడు ఆలోచనాపరుడయి, మిక్కిలి
పరిశ్రమించి దుఃఖదాయకములు, పారతంత్ర్య పరవశత్వ
మూలకములగు తన పురాతనాలోచనలను, తన ప్రాచీన
కార్యపద్ధతులను మానుకొనవలసియుండును. వాటి స్థాన
మున సుఖప్రదములు శాంతి సంధాయకములు, స్వాతంత్ర్య
పోషకములునగు నూతనాలోచనలను, నవ్యకార్యపద్ధతు
లను నెలకొనజేయవలసియుండును.

ఈ నూతనాలోచనా స్వీకారము ఈ నూతనకార్య
పరిగ్రహము ఒక దినములోగాని, ఒక మాసములోగాని
ఒక సంవత్సరములోగాని సాధ్యపడక పోవచ్చును. కాని
నిరాశ జెంద బనిలేదు దురభ్యాసముల ద్యజించి వాటిస్థాన
మున సదభ్యాసముల నలవరచుకొనుట అంత సులభకార్యము
కాదు.

దీనికి కొంత కాలము పట్టును. కాని మార్పుకలిగి
తీరును. జయము సిద్ధము. ఇందావంతయు సంశయములేదు.
ప్రప్రథమమున అపజయము కలిగినను ప్రయత్నము
విరమింపరాదు. వజ్ర సంకల్పము, ఉల్లాసపు పట్టుదలతో
ప్రయత్నమునంటిపెట్టుకొని యుండవలయును. చివరకతడు
సఫలమనోరథుడగును. మీకు బుద్ధిపూర్వకముగ వాంఛింప
నట్టియు, దుఃఖప్రదమగునట్టియునగు దురభ్యాసము బలపడి
పాదుకొన పోవగలిగినపుడు సమాజము, సత్ఫలదాయకము,
సత్ప్రభావ సమన్వితమునగు సదభ్యాసమేల అభ్యస్తము
కానేరదు. మనుష్యుడు "నేను నా కష్టములనుండి గట్టెక్క

లేను, నేను నా చెడ్డ అలవాట్లను మానుకొనలేను " అని భావించుచున్నంతవఱకు వాని కష్టములు, అలవాట్లు తొలగనేరవు. ఇట్టి నిరాశోపహత దుర్బల భావన కలిగి యుండువఱకు ఆతడు కష్టములనుండి కట్టెక్కలేడు. అలవాట్లను మానలేడు. మానవజీవనపథమున మానవుని నిరాశయే వినాశాత్మకము, విపత్కరమునయి యున్నది. నేను నా దురభ్యాసమును త్యజించలేను' అను భావనయే మనిషికి భయంకరశత్రువు. ఈ భావనయే వానిని పెడత్రోవపట్టించు నైతానుగభావించవలెను. ఈభావనను మనోఫలకమునుండి తుడిచి పెట్టెదవేని నీవు సకలకష్టములనుండి, పాపములనుండి విముక్తి నందుదువు. నే నీ దురభ్యాసమును దూరమొనరించుకొనలేను అని భావించు చున్నంతవఱకు నిన్నాదురభ్యాసము ఛాయవలె నిన్ను వెంబడించుచునే యుండును. అప్పటివఱకు ఆ దురభ్యాసమునకు దాసుడవయి యుందువు. నీ మనోబలమువలన, నీ సంకల్పశక్తి సాహాయ్యమున నీవు దురభ్యాసమను శత్రువును జయించగలవు. ఒక దైవశక్తి నాకు తోడ్పడగలదు. ఒక మహాపురుషుడు నన్ను ఉద్ధరించగలడు అని భావించుచుండుట అవివేకము. నేనే అవతార పురుషుడను, నన్ను నేనే ఉద్ధరించుకొనగలను అని భావించనంతవఱకు అతడు స్వతంత్రుడు కాలేడు. సంస్కరింపబడడు. "మానవుడే సత్యము. మానవుడే మాధవుడు. అనుమాట ప్రతి మనుష్యుడు నిత్యము జ్ఞాపకముంచుకొనవలెను. అపుడే ఆతడు మంచిఆలోచన

చేయుగలడు. తత్ఫలితముగ మంచి కార్యములాచరింప గలడు.

మనల బంధించునవి మన అలవాట్లే - మనల బంధ విముక్తుల జేయునవియు అవియే. అలవాటు యొక్క ప్రథమ దశ ఆలోచన, ఆలోచనయే పిమ్మట కార్యముగ బరిణమించును.

ఆ కార్యమే పునరావృతమయి అలవాటుగ మారుచున్నది. కనుక నీ మనస్సున ఉదయించు చెడ్డ ఆలోచనలను మంచి ఆలోచనలలోనికి మార్చుకొనుము. అపుడు మీరు చేయు కార్యములు సయితము తత్ క్షణమే మంచివిగ మారిపోగలవు. నీవు నీ చెడ్డ ఆలోచనలను విడువక వాటినే అంటిపెట్టుకొని యుందువేని అవి నిన్ను తన ఉక్కుపిడికిలిలో బిగించి వేయుగలవు. నీవు మంచి యాలోచనల జేయుదువేని స్వతంత్రుడవయి సుఖజీవనము చేయుగలవు, చెడ్డ ఆలోచనలచే ప్రేరితుడయి బంధమునబడి యుండగోరు వ్యక్తిని అందేపడి యుండనిమ్ము. బంధము నుండి బయటపడ నుత్సహించు వ్యక్తిని బయటకు వెడలి స్వతంత్రునిగ బ్రతుకనిమ్ము. ఎవనికర్మకు వాడే కర్త, ఎవని కర్మఫలము వాడే అనుభవించవలెను. ఇది సిద్ధాంత వాక్యమనుట మఱువకండి.

"అవశ్యమను భోక్తవ్యం,
కృతంకర్మ శుభాశుభం"

"బంధనమును కల్పించుకొనువారము మనమే దానిని తెంచుకొనగలవారము మనమే"

"వెనుకటి అభ్యాసఫలమే మన జీవనము. ప్రస్తుతాభ్యాసము వలన మన భావిజీవిత నిర్మాణము జరుగును. కొంత జీవితచక్ర పరిభ్రమణము వలన మనమీస్థితికి వచ్చితిమి. సక్రమముగ ఈ చక్రమును తిరుగనిచ్చితివేని దీని పరిభ్రమణము పూర్తియగును."

"ధైర్యముగా కార్యమాచరింపుము. ఒకదినములోనే ంవత్సరములోనే సిద్ధి కలుగునని ప్రతీక్షింపకు, న్నత లక్ష్యమును అంటిపెట్టుకొనియే యుండుము. ంగా నుండుము. చాపల్యము రానీయకుము. ప్రపంచ పాపమేదని యున్నయెడల అది దౌర్బల్యమే. విధములగు దౌర్బల్యములను తొలగించుకొనుము.

దుర్బలత పాపము, దుర్బలతయే మృత్యువు, ర్బల చంచలాత్మను మానవుడనుటయే తప్పు."

— స్వామి వివేకానంద.

# ఆరోగ్యము - ఆధివ్యాధులు

వర్తమాన యుగమున వేలకొలది ఆస్పత్రులు, ఆరోగ్యసంస్థలు స్థాపించబడి పనిచేయుచున్నవి. దీనినిబట్టి మానవసమాజము రోగములచే ఎంత చుట్టుముట్టబడి యున్నదో తెలియుచున్నది. ప్రతి చికిత్సాలయములో రోగముల నివారించుటకు అహోరాత్రములు అవిరళకృషి సలుపుచునే యున్నారు. ఒక్కొక్క రోగమునకు ఒక్కొక్క స్పెషలిస్టు చికిత్స చేయుచునే యున్నారు. కాని రోగములు తగ్గకపోగ పెరుగుచున్నవి, శారీరక వ్యాధులవలెనే ఈకాలపు మనుష్యుల మనస్సులును అశాంతి నిలయములుగ నున్నవి మనుష్యులలో మానసికశాంతి, మానసిక స్వాస్థ్యము కఱవయినవి. మానసికశాంతిని కలుగజేసి మానసిక స్వాస్థ్యమును కలుగజేయుటకు అనేక మతసంస్థలు ప్రబోధ ప్రచారములు గావించుచునే యున్నవి. ప్రపంచమందలి ప్రబలితములయియున్న మతములన్నియు మానవుల మనస్సులను పవిత్రీకరింప ప్రయత్నములు చేయుచునే యున్నవి, కాని వారిమనస్సులు పవిత్రములగుటకు మారుగ అత్యంత అపవిత్రములయి పతనోన్ముఖములగుచున్నవి. ఇపుడొక ప్రశ్న ఉదయించుచున్నది. ఈ చికిత్సాలయములు, ఈ ఆరోగ్య సదనములు నిరర్థకములేనా ? ఈ మతసంస్థలు, మతప్రబోధములు నిష్ప్రయోజనములేనా ? వీటిపయి వెచ్చింపబడు ధనము వృథాయేనా ? ఇక ఈ సంస్థలను మూసివేయవలసినదేనా ?

గత అధ్యాయములలో వెల్లడించిన భావముతో ఈ ప్రశ్నలకు జవాబను నట సమంజసము. మనుష్యుడు తన మనస్సును వశ మొనరించుకొన నంతవఱకు ఆతడు రోగ గ్రస్తుడు, శోకసంతప్త హృదయుడుగనే యుండును.

అంతవఱకు ఆతని జీవితము దోషదూషితము, అశాంతిమయముగనే యుండును. చికిత్సాలయములు మత సంస్థలు బాహ్యోపచారములు మాత్రమే అయియున్నవి. ఇవి మనిషికి శాంతినొసంగుటకు బాహ్యోపకరణములు మాత్రమే, వీటిప్రభావము మనుష్యుని మనస్సుపయి ప్రసరించుటలేదు. ఎవరెన్ని ధర్మప్రబోధములు చేసినను, ఎవరెన్ని చికిత్సావిధానములను ప్రయోగించినను మనము మన మనస్సులను జయించనంతవఱకు అనగా మనస్సును వశపఱచుకోనంతవఱకు నిరర్థకములు. మన ఆలోచనలు అశుభ్రముగ ఉన్నంతవఱకు వాటివలన ప్రయోజనము పొందలేము.

రోగములు, దుఃఖములు, పాపములు బాహ్యోపచారముల వలన ఉపశమించవు. మన రోగములకు మన మనస్సే మూలకారణము. మనరోగ నిర్ణయము మన మనసు నుబట్టి చేయువలసి యుండును. ప్రాకృతిక పరిసర పరివర్తన ప్రభావము సయితము రోగములకు కారణములనుటనే నొప్పుకొందును. మానవశరీరముపయి వాటిప్రభావము ప్రగాఢముగ నుండుననుటయు నేనంగీకరింతును. బాహ్యభౌతిక కారణములు సయితము అనేక వ్యాధులకు చాలవఱకు మూలములనుట నిస్సందేహము. ఇతర కారణ

ములవలె మనస్సు కూడ ముఖ్యకారణమనుట మఱవరాదు. అశుభ్రత అనేక వ్యాధులకు కారణమగుచున్నది. అశుభ్రత మన మానసికస్థితిని దెలుపును. మన మనస్సు అపవిత్రముగ నుండుచో మనముండు ప్రదేశము అపరిశుభ్రముగ నుండును. అపరిశుభ్రతకు ముఖ్యకారణము మనస్సు అనుట అతిశయోక్తి కాదు.

నేటి నాగరిక ప్రపంచమున మానవుడు తన అభిలాషలను, అభిరుచులను, అవసరములను అనంతముగ పెంచుకొనినాడు. తన్మూలమున అతడు శాంతిని. సమానమును కోల్పోవుచున్నాడు. అతడు అనేక వ్యాపారములకు, వ్యవహారములకు లోనయి శరీరధర్మములను, ఆరోగ్యవిధుల నుపేక్షించుచున్నాడు. అపుడతడు రోగగ్రస్తుడగుచున్నాడు. ఈ అంతుమాలిన అవసరములే కోరికలే అతనిని రోగగ్రస్తునిజేయుచున్నవి. ఒక అవసరము తీరగానే మఱియొక అవసరముకొఱకు ఒకకోరిక తీరగానే వేఱొక కోరిక నుతీర్చుకొనుటకొఱకు అతడు ఉరుకులు, పరుగులు పెట్టుచున్నాడు. తత్ఫలితముగ అతడు విశ్రాంతిగ తృప్తిదీర పొట్టనిండ భోజనం చేయలేకపోవుచున్నాడు, ఆదమఱచి సుఖముగ నిద్రపోలేకపోవుచున్నాడు.

వాని యీ కోరికలే కామక్రోధాదులుగ మారి వానిని రోగగ్రస్తుని జేయుచున్నవి, మఱి మృత్యువాతను బడవేయుచున్నవి. నేడు ప్రపంచమును యుద్ధజ్వరముపట్టి పీడించుచున్నది. స్వార్థపరత్వమే దీనికి కారణము. మనము మన పొరుగువాని సుఖ సౌకర్యములను, స్వాస్థ్యములను

అపహరించుచున్నాము. అనగా మన ఆశాపాశము అంత
నిజేవి అయినందున్నమాట మనము మనదృష్టిని పశువులవంక
సారింతుమేని అవి ఈకాలపు మనుష్యులకంటె ఎన్నో రెట్లు
ప్రశాంతముగ బ్రతుకుచున్నట్లు తెలియగలదు. అవి ఒక
సారి ఆహారమును తీసుకొనిన తరువాత హాయిగనిద్ర
పోగలవు. కాని మనుష్యుడు అంతులేనికోరికలకు దాసుడయి
అశాంత చిత్తుడగు చున్నాడు. పశువులు తమ పరిస్థితుల
ననుసరించి ఇతరపశువులతో కలిసిమెలిసి జీవించుచున్నవి.

సారసపక్షులు, చిలుకలు, కొంగలు గుంపులు గుంపు
లుగ కలిసి ఆకాశపథమున విహరించుచున్నవి. చీమలు
బాటను బారులు బారులుగ కలసి పరస్పర సహకార
సాహాయ్యములు చేసుకొనుచున్నవి. అవి తమ ఆహార
పదార్థములను ఒకటికొకటి అందించుకొనుచు గమ్యస్థానము
నకు చేరవేసుకొనుట మనము నిత్యము ప్రత్యక్షముగ
చూచుచున్నాము. ఈ జీవులు మనుష్యులకంటె హీనములని
భావింపదగునా? మనుష్యులు పరస్పర ప్రేమతో, ఐక్య
భావముతో ప్రవర్తించుచున్నారో, ఆధునిక యుగమున
మనుష్యులు పశువులకంటె సుఖముగజీవించుచున్నారో
మనుష్యులే ఒకరికొకరు నిర్దయులయి, రాక్షసులయి, నరుకు
కొనుచున్నారు. అట్లనుట పశువు చతుష్పాద జంతువు
అగుచో మనుష్యుడు ద్విపాదపశువు అగుచున్నాడు.
పశువేకాదు పశువుకంటె పతితుడు, పాపి యగుచున్నాడు.
అట్టితటి మానవుడు తనను సృష్టిలోని సమస్త జీవులకంటె
ధికుడనని అదిరపడనేల?

ఎప్పుడు మనుష్యుడు ఈర్ష్యా ద్వేషములను విడ నాడునో, ఎపుడు అతడు స్వార్థమును త్యజించి సేవాభావ మును స్వీకరించునో ఎప్పుడాతడు తన పొరుగువాని మేలును కోరునో అపుడే ఆతడు దైవసమాను డగుచున్నాడు.

శరీరము మనస్సుయొక్క ప్రతిబింబము. శరీరము పయి మనోభావముల ప్రభావముపడుచుండును. శరీరము మనస్సునకు లోకువ. ప్రతి శారీరకావస్థకు మనస్సే మూల కారణమని విజ్ఞానశాస్త్రవేత్తలు నిర్ణయించగలరు.

మానవుని స్వాస్థ్యము అతని సత్ప్రవర్తనము, మనశ్శాంతిపయి ఆధారపడియున్నది. ఏవ్యక్తియైని రోగ గ్రస్తుడయినపుడు ఆతడు మానసిక చికిత్సనుప్రక్రమించునేని మందులవలె వెంటనే గుణముకనపడక పోవచ్చును. కాని నెమ్మదిగ గుణము కనబడును. మానవుడుధర్మపథానుగామి యగుచో ఆతడు క్రమముగ ధార్మికుడగును. ఆతని నైతిక బలము దినదినాభివృద్ధి యగుచో ఆతని శాంతియుతధార్మిక మానసము శారీరకవ్యాధుల నిర్మూలించుటలో తన ప్రభా వమునుజూపగలదు ఆతనికొక్కసారిగ సంపూర్ణ స్వాస్థ్యము లభింపకపోవచ్చును. బాధోపశమనము కలుగగలదు. ఆతని నిశ్చయాత్మకాలోచనము, మానసిక శక్తిచిత్తవృత్తుల నిరోధము ఆతనిరోగమును క్రమముగ నివారింపగలవు. మానసిక అశాంతివలన, మనోవికారముల వలన రోగము సమూలముగ నివారణకాదు. పైగా ఒక్కొక్కపుడు అ అసాధ్యముగ మారవచ్చును. మనస్సుముఖ్యము శరీరము అముఖ్యము. (మనస్సుప్రధానము శరీరముగౌణము) మనస్సు

ప్రబలముగ నున్నచో శరీరమువలన మనకుహాని వాటిల్ల
నేరదు. చాలమంది మొట్టమొదట మనస్సునకీయదగు
ప్రాముఖ్యమును దానికీయనుత్సహింపరు రోగము తగ్గకే
పోయినను శక్తివంతము, దృఢతమమునగు మనస్సు కలిగి
యున్నచో రోగినిరంతరము సుప్రసన్నముఖారవిందుడయి
యుండును. దౌర్బల్యము, రోగము ఆతనిని బాధింపనేరవు.
ఆతడాస్థితిలోనయినను పరులకుపకారముగావించుచుండును.

ఆరోగ్య శాస్త్రజ్ఞులు "ఆరోగ్యములేని వ్యక్తి
ప్రయోజనకరమగు వాంఛిత కార్యము గావింపజాలడు.
ఆతడు తనజీవితమును సౌఖ్యవంతముగ గడుపజాలడు" అని
నుడువుచుందురు. కాని వివిధ దేశములలో వివిధ రంగము
లలో ఘనకార్యములుసాధించినవారు, దుర్బలులుగ,
రోగులుగ నుండుటనే మనము చూచుచున్నాము. అట్టితఱి
శరీరశాస్త్రజ్ఞుల కథనములలో మాకుసారము కనబడుటలేదు.
రోగగ్రస్తుడు బుద్ధితో మఱింతఎక్కువగ పనిచేయుచుండు
టను. పైపెచ్చు రోగమువలన బుద్ధికత్యంత బలములభించు
చుండుటను మనము అనుదినము ప్రత్యక్షముగ చూచు
చున్నాము. రోగమువలనబుద్ధిచే చేయబడు కార్యమునకెట్టి
ఆటంకముకలుగనేరదు. ఆనందమయము, ప్రయోజనకరము
నగుజీవితప్రాప్తికి మంచిఆరోగ్యముఅవసరమనువిషయము
మాకుయుక్తియుక్తముగకనబడుటలేదు. ఈవాదముగావించు
వారు మనస్సును శరీరమునకు లోకువ జేయుచున్నారు.

ఎవరిమనస్సులు శక్తిమంతములో అట్టివారి శరీరములు రోగగ్రస్తములయినను వారు లక్ష్యపెట్టరు. వానినుపేక్షింతురు. వారి కేరోగములు లేనట్లే భావించి తమ కార్యకలాపములను యథారీతి కొనసాగించు కొనుచునే యుందురు. ఈ విధమున శరీరము నుపేక్షించుటవలన మనస్సు పరిపుష్టము, ఆరోగ్యవంతమగ నుండుటయేగాక శరీరము సయితము స్వస్థమగుచున్నది. మనము సంపూర్ణారోగ్యమును బడయజాలకున్నను స్వస్థతగల మనస్సును మాత్రము తప్పక పొందగలము. వాస్తవమునకు శరీరము స్వస్థముగ నుండుటకు స్వస్థతగలమనస్సే మూలకారణము.

అస్వస్థ శరీరముకంటె అస్వస్థ మానసమే అధిక దుఃఖదాయకము. మానసిక అనారోగ్యమువలన శారీరక వ్యాధి పెరుగగలదు. శారీరక వ్యాధిగ్రస్తునికంటె మానసికముగ దుర్బలమగు మానవునిస్థితి దయనీయము. మఱి దుఃఖప్రదము. మనోదౌర్బల్యమువలన తమ రోగముల నుండి విముక్తి నందజాలని రోగులను డాక్టర్లు చూచుచునే యున్నారు. మనోవ్యాధికి మందులేదనుమాట ముమ్మాటికి నిజము. అందువలన కొందఱు డాక్టర్లు ముందుగ రోగియొక్క మానసికస్థితిని పరీక్షించి, ముందుగ వారికి మనోనిబ్బరము కలుగజేసి మానసికముగ స్వస్థునిగ జేయుచుందురు. అప్పుడు శారీరకవ్యాధి చాల సులభముగ నివారణ అగుచున్నది. మనుష్యుడనిపించుకొనగోరువ్యక్తి మొట్టమొదట తన మానసిక, శారీరక భోజన విషయిక సమస్త దుర్బలాలోచనలను దూరమొనరించుకొనవలెను. అనగా ఎల్లప్పుడు

తన శరీరమునుగూర్చి, భోజనమునుగూర్చి లేనిపోని పిచ్చి భ్రమలను పెట్టుకొని అదేపనిగ వాటినిగూర్చి చింతించుట మానవలెను. ఏ భోజనము సమస్త జనులకు లభ్యమయి ఆరోగ్యప్రదముగ నుండునో అది తనకు సరిపడుటలేదని ఏ మానవుడు భావించునో ఆతడు మానసిక రోగగ్రస్తుడని తలంపవలెను. వాని మనోదౌర్బల్యమును దూరము చేయుటయే దీనికుపచారము.

సామాన్యమానవులకు దుర్లభమగు పౌష్టికాహారము మద్రసాపేక్షాహారము వలననే తన ఆరోగ్యము బాగుండునని తలంచు మానవుడు తనవ్యాధుల తనకుదానయి ఆహ్వానించుకొను చున్నాడని తలంపవచ్చును. శాకాహారి "బంగాళాదుంపలు తినుటవలననే ఆరోగ్యము చెడిపోయినది. పండ్లు తినుటవలన నాకజీర్ణము కలిగినది. సీమరేగుపండు తినుటవలన ఆమ్లము హెచ్చినది. పప్పుపదార్థములు విషప్రాయములయినవి కూరగాయలవలన చాలకీడు కలిగినది. ఈ రీతిగనే ఇతర ఆహారపదార్థములు పయిలేము నా ఆరోగ్యమును చెడగొట్టుచున్నవి" అని సందేహించు చుండునో, ఏ లక్ష్యము నుద్దేశించి ఆతడీవిధముగ నుడువుచున్నాడో ఆ లక్ష్యమునకు విరుద్ధముగ నడచుచున్నాడనుట నిస్సందేహము. ఆహార విషయములో ఏ నియమనిబంధనల పాటింపని మాంసాహారుల యెదుట పిడివాదిగ ఋజువుచేసుకొనుచున్నాడు. పండ్లు తినుటవలన మనము రోగగ్రస్తులమగుదుమనుకొనుట ప్రకృతినిగూర్చి భోజన నియమముల

గూర్చి మన అజ్ఞానమును తెలుపుటయే గాక ప్రకృతికి విరుద్ధముగ ప్రవర్తించుచున్నామనుట మరువరాదు.

శరీరమును శక్తిసంపన్నము, దీర్ఘాయుష్మంతము గావించుటయే ఆహారముయొక్క లక్ష్యముగాని దానిని దుర్బలము గావించి నశింపజేసుకొనుట కాదు. ఆహారమును గూర్చి పిచ్చి భ్రమలకు లోనయి ఎవరో తానూహించిన ఆహారముద్వారా తమ స్వాస్థ్యమును వృద్ధిగావించుకొన జూచుచుండుట ఆశ్చర్యము. దీనివలన వారిశరీరములకు గొప్ప హాని సంభవించుచున్నది. శుద్ధసాత్త్విక ప్రాకృతికాహారము వారికాయువు, ఆరోగ్యము ప్రసాదింపక వారిని మృత్యుముఖమున బడద్రోయుచున్నదను వారి యీ భావన ఎంతో భ్రమప్రమాదభూయిష్ఠము. ఒక పర్యాయము ఒక వితండ వాదియగు ఆహారశాస్త్రజ్ఞుడొకడు రొట్టెతినుటవలన జబ్బుపడితినని అందఱితో చెప్పుచుండెను. మితిమించి రొట్టెను తినుట వలన అస్వస్థత కలిగినదని చెప్పుటలేదు. ఇవన్ని అపోహలు, చెడ్డ ఆలోచనలు. కనుక మనము ఈ రోగమూలకములగు ఇట్టి పనికిమాలిన ఆలోచనలను మన మనోమందిరమున ప్రవేశింప నీయకుందుముగాక ! ఇట్టి నిరాధారములు, నిర్హేతుకములునగు కారణములవలన మనకు రోగములు కలుగుచున్నవని మనము భావింపకుందుముగాక !

మనుష్యుడు తన స్వల్పములగు కష్టనష్టములకు ప్రాముఖ్య మీయరాదు. మనకు కొంచెము తలనొప్పి వచ్చినదా డాక్టరువద్దకు పరుగెత్తుచుందుము. మనము

కొంచెము కష్టపడవలసి వచ్చినదా దురదృష్టవంతుల మను కొందుము. ఇవి మన మానసిక దౌర్బల్యమునకు మనచరిత్ర బలహీనతకు నిదర్శనములు.

మానవ జీవితములో ఇటువంటి సామాన్యకష్టములు, ఇబ్బందులు తటస్థపడుచునే యుండును. వీటినిగూర్చి అదే పనిగ ఆలోచించుచు కూర్చుండుటవలన ప్రయోజనము లేదు. ఇట్టి స్వల్పవిషయములను గోరంతలను కొండంతలుగ భావించడం అనర్థహేతువు. మనము మనకష్టములను గూర్చియు, ఆధివ్యాధులగూర్చియు ఆలోచించుటకు బదులుగ మన సుఖమునుగూర్చియు, మన ఆరోగ్యమును గూర్చియు ఆశావిశ్వాసముల గలిగియుండువేని మిక్కిలి ప్రయోజనము కలుగగలదు.

ఒక సుప్రసిద్ధకవి ఎంత చక్కని భావముల ప్రకటించెనో గమనింపుడు :—

“మనము సుఖమయ జీవితము గడుపుదుము గాక ! మనమెవ్వరిని ద్వేషింపకుందుముగాక ! మనల ద్వేషించు వారలమధ్య మనము ద్వేషములేనివారమయి ఆనందముతో సంచరింతుము గాక ! మనము వ్యాధిపీడితులమధ్య ఆరోగ్యవంతులమయి ఆనందమయ జీవితము గడుపుదుము గాక ! మనము లోభులకు దూరముగనుండి జీవితసౌఖ్య మనుభవింతముగాక ! లోభులకుమధ్య నివసించుచున్నను లోభరహితులమయి. ఉదారులమయి ఉత్తమ జీవితము గడుపుదుముగాక !”.

నైతిక సిద్ధాంతముల ననుసరించి జీవన పథమున పయనింతుమేని సంపూర్ణారోగ్యము, శాంతి సంతోషముల బడయగలము, ఈ నైతిక సిద్ధాంతములే మన జీవితమును తీర్చిదిద్దుచున్నవి. వీటివలన జీవితమందలి ప్రతిరంగము పరిష్కృతమయి ప్రకాశింపగలదు.

మానవుడు ఈ నైతిక సిద్ధాంతములను చక్కగ గ్రహించి వాటి ననుసరించి ప్రవర్తించునేని స్వల్ప విషయము మొదలుకొని గొప్ప విషయముల వఱకు సమస్త విషయములలో ఉన్నతినందగలడు, ఈ సిద్ధాంతములు ఒకవంక మనుష్యుని ఆహారము నియమబద్ధము గావించుచు ఆహారసంబంధములగు వ్యర్థపుటాలోచనలనుండి, అర్థ లేని అపోహాలనుండి విముక్తుని గావింపగలవు మనుష్యు పవిత్రాలోచనలు ఆతని సమస్తదోషములను దూర మొన రించి శరీరమును బలిష్ఠముగ స్వస్థముగ నుంచగలవు సచ్చరిత్రుడు శారీరకముగను స్వస్థుడుగనుండును.

నిరంతరము రోగముల గూర్చి, మనశరీరమునుగూర్చి అర్థములేని అపోహాలకులోనయి ఊరకే మనోవ్యాకుల జెందుచుండుటకంటె దానిని పట్టించుకొనకుండ తటస్థభా ములో నుండుటయే శ్రేయస్కరము. ఇంతేకాదు మనః మఱొక అడుగు ముందునకు వేయవలెను. అనగా మన రమునకు మనమే యజమానులమనుమాట జ్ఞాపకము కొనవలెను. అనగా శరీరముమీద మనకు సంపూర్ణ యా

మాన్యము, అధికారము ఉండవలెను. మనము మన యింద్రియములను మనస్సును వశపఱచుకొన గలిగినపుడే మనము మన శరీరమునకు యజమానులుగనుండ నర్హులమగుదుము. ఏనాడు మన ఆహార విహారములను మితముగ, హితముగ, నియమబద్ధముగ నుంచుకొందుమో, ఏనాడు మనము మన శరీరముకంటె సత్ప్రవర్తనకే ప్రాముఖ్య మొసంగెదమో, ఏ దినమున మనము మన శరీరమును వైద్యుల కృపాకటాక్ష వీక్షణములపై ఆధారపడకుండ మన నైతికబలముద్వారా, పరిశుద్ధ చిత్తముద్వారా స్వస్థముగ నుంచుకొనుటకొఱకు ప్రయత్నింతుమో ఆ దినమున మనము సుఖము, శాంతి ననుభవింతుము. ఆ దినమే మనకు శుభోదయము.

---

# పేదరికము

ప్రాచీనకాలమునుండి ప్రతియుగమునందు మహాపురుషులు తమఉన్నతాదర్శసిద్ధికొఱకు ధనమును తిరస్కరించి నిరాడంబరజీవితమును గడపిరి. వారు పేదరికమును దైవప్రసాదముగ స్వీకరించిరి. అట్టిచో జనులు పేదరికమును ఏలఘోరవిపత్తుగ భావించుచున్నారు? ఏ పేదరికమును మహాపురుషులు వరప్రసాదముగభావించివరించిరో ఆపేదరికమునే ఈకాలపుజనులు ఈశ్వరునిచే తమకు విధింపబడిన ఘోరదండనగ, మహామారిగ ఏల భావించుచున్నారు!

మహాపురుషుల సంయమితఉన్నత మానసమే దీనికి కారణమనుటస్పష్టము. మనస్సులో మహత్త్వమున్నచో, ఆలోచనలు తేజస్వంతములగుచో ధనాభావము ఏమిచేయగలదు. మహాత్ములకు ధనముతో ఏమిపని? ఏ మనిషికి విషయవికారములు లేవో, ఏమనిషి తృష్ణకు వశీభూతుడు కాడో ఆతనికి ధనమువలన ప్రయోజనమేమున్నది! సాధు సరళజీవితమే సౌందర్యద్యోతకము. ప్రకృతి ఎంతసరళమైనది. పారిశుద్ధ్యమందే సారళ్యముకలదు. స్వచ్ఛతయే ప్రత్యక్షసౌందర్యము. పూర్వకాలములో మహారాజులనేకులు తమ భోగభాగ్యములను, రాజప్రాసాదములను పరిత్యజించి పర్ణకుటీరములలో ప్రమోదచిత్తులయి కాలముగడపిరి. శంకరాచార్య భగవత్పాదులు తృష్ణగలవానినే దరిద్రుడనెను. సంతృప్తి గలవానినే ధనవంతుడనెను. వాస్తవ

ముగా దారిద్ర్యమననేమి? పేదరికమనగా డబ్బు లేక
పోవుటగాదు. చరిత్ర భ్రష్టతయే దారిద్ర్యము. మత్తు
పదార్థముల సేవించుట, తిట్టుతిట్టుట, అవినీతి, దొంగతనము,
జూదమాడుట మున్నగునవన్నియు పాపకృత్యములు.
అవినీతితో అన్యాయముగ డబ్బు సంపాదించుటకంటె ఆకలి
దప్పులతో అలమటించుచు చనిపోవుటయే మేలు. ప్రపంచ
మందలి మతప్రవక్తలందరు ఏసు, బుద్ధుడు, మహమ్మదు
ధనమదాంధతను తెగడిరి. నిరాడంబరను పొగడిరి. పాపపు
వృత్తి, దారిద్ర్యము ఈ రెంటిలో ఏది చెడ్డది? పాపపు
వృత్తియే చెడ్డదనుటలో సందియములేదు. పాపపు వృత్తి
వలననే దారిద్ర్యము నిందనీయమగుచున్నది. దారిద్ర్యము
నుండిపాపాలోచన, పాపవృత్తి పారద్రోలుదుమేని దాని
పీడ విరగడయయిపోవును. ఇంతవఱకు ఏ దారిద్ర్యము
మిక్కిలి అవమానకరముగ, హీనముగ, హేయముగ
భావించబడినదో ఆ దారిద్ర్యమే ఇపుడు దివ్యముగ, భవ్య
ముగ సాక్షాత్కరింప గలదు. ఇంతేగాదు అపుడది మీకు
అత్యంత ప్రయోజనకరముగ కనబడగలదు.

చైనా దేశపు సుప్రసిద్ధ తత్త్వవేత్తయగు కన్ఫ్యూసి
యస్. తనుఒక పేదశిష్యుని ధనవంతులగు ఇతరశిష్యులకంటె
అధికముగ ప్రేమించెడివాడు, ఆదరించెడివాడు. ఈ పేద
శిష్యుడునేలలో ఒకచిన్నగొయ్యి త్రవ్వుకొని అందు
నివసించెడివాడు. వేళకు కలో,గంజో త్రాగి తనకున్నదానితో
సంతుష్టాంతరంగుడయి, పూర్ణ వికసితప్రసూనమువలె సుప్ర
సన్న ముఖారవిందుడయి కాలము గడపుచుండెడివాడు.

అతడుతనపరిస్థితికిలొగ్గువాడుకాడు. ధనవంతులగుశిష్యులు నిరంతరము పరస్పరము కలహించుకొను చుండెడివారు. అసూయాద్వేషములతో క్రుగ్గుచుండెడివారు. దారిద్ర్యము సచ్చరిత్రునికి దుఃఖమునొసంగజాలదు. అదిమహాత్ములను బంగారమునకుతావిఅబ్బినట్లుగ వారినొక ఉన్నతస్థానమున ఆసీనునిగావించును. అందువలననే కన్ఫ్యూసియస్ ని శిష్యునిగుణములు మిక్కిలి రాణించినవి. అతడుమట్టిలో మాణిక్యమువలె ప్రకాశించెను.

సంఘసంస్కర్తలుదారిద్ర్యమును పాపమునకుమూలమనుచున్నారు, ఆసంస్కర్తలేమరల జనులుఅవినీతిపరులగుటకు ధనమేకారణమనుచున్నారు. ఈకారణమే అవినీతికి, పాపమునకుమూలమగుచో కర్మకూడ పాపభూయిష్ఠమగును. కారణమువలననే కార్యము జరుగుచుండును. కనుక [illegible] ధనము దురాచారమునకు, పాపమునకు, అవినీతికి కారణమగుచో ప్రతిధనవంతుడు పాపాత్ముడుకావలసి వచ్చు: అట్లే ప్రతిపేదవాడు పరాభవింపబడును.

పాపాత్ముడు సర్వకాలసర్వావస్థలయందు పాప[illegible] గావించుచుండును. అతడు ధనవంతుడగుగాక, నిర్ధనుడగుగాక లేక మధ్యతరగతి వ్యక్తి అగుగాక ఇదేరీతిగ పుణ్యాత్ముడు ఆతడెట్టి స్థితియందున్నను ఉపకారమే చేయుచుండును. అట్లగుట పాపపుణ్యములు మానసికములుగాని ధనదారిద్ర్యములతో సంబంధముగలవి కావు. అంతరంగమున దాగియున్న పాపము అవకాశము లభించినంతనే, దానికనుకూల పరిస్థితులు తోడుకాగానే తానంతటది

బహిరంగమయియేరును. పరిస్థితులు పాపమును సృజించలేవు. ఒకవ్యక్తి స్వీయార్థిక స్థితిపట్ల అసంతుష్టచిత్తుడయి యుండుటొక విషయము. సహజముగ నిర్ధనుడుగ నుండుట మఱొక విషయము. అనేకమందికి సంవత్సరాదాయము వేలకొలది రూపాయలుండును. వారికి గృహస్థభారము అంతగ నుండదు. శ్రమ చేయవలసిన పనియు నుండదు. అయినను వారు తమను పేదవారుగానే భావించుకొను చుందురు. ధనతృష్ణయే వారి యీభావనకు మూలకారణము. వాస్తవమునకు వారి యీ వ్యాకులతకు, వ్యగ్రతకు కారణము దారిద్ర్యముకాదు. అధికముగ, అధికాధికముగ ధనమును కూడబెట్టవలయునను వారిదురాశయే, పేరాశయే వారిదుఃఖమునకు కారణమయియున్నది. వారి దారిద్ర్యము మనోకల్పితమేకాని ధనాభావమువలన కలిగినది కాదు. మానవుడు తృష్ణకు వశీభూతుడయి, సంతుష్టిలేని వాడయి ఎక్కువధనమును, పేరాశను కలిగియుండువఱకు గర్భదరిద్రుడుగనే యుండును. పేరాశ వారిని విడువనంత వఱకు అతడు తనను పేదవానినిగనే భావించుచుండును. ఈ దృక్కోణముతో చూచినయెడల అతడు ధనవంతు డయ్యు పరమదరిద్రుడే. ఏలననగా లోభము మనో దారిద్ర్యసంభూతము. ఒకలుబ్ధాగ్రేసర చక్రవర్తియగు కోటీశ్వరుడు తాను గుడ్డిగవ్వసయితములేని గర్భదరిద్రుడుగ నున్నపుడు తన్నెట్లు దరిద్రునిగ, దీనునిగ భావించు కొనుచుండెడివాడో కోటీశ్వరుడయినపుడును తనను దరిద్రునిగనే భావించుకొనుచుండును.

ఎంతో మంది తమ పేదరికములోనే మగ్గుచు అంతే సంతృప్తి జెందుచు జీవితము గడుపుచున్నారు. ఇట్టివారు సంతృప్తికి పెడర్థము తీయుచున్నారు. సంతృప్తి యనగ మనము జీవనపథమున ముందునకు పయనించకుండ ఆగి పోవడంకాదు. దారిద్ర్యము, సోమరితనము, మురికి, మూర్ఖత్వము, అశ్లీల ప్రసంగములు, మురికిపేటలు, మురికి యిండ్లలో నివసించుట సంతృప్తికి చిహ్నములుగావు. ఇట్టి సంతృప్తి మూర్ఖత్వ మనిపించుకొనును. ఇట్టి దారిద్ర్యము సహజమైనదికాదు. ఇది మానసిక దౌర్బల్య రూపమేకాని అన్యముకాదు. ఈ మనోదౌర్బల్యమునుండి మనము మేలకువగ నుండవలెను. ఈ సమస్యాపరిష్కారమునకు ఒకేఒక ఉపాయము కలదు. మన దారిద్ర్యబంధ మోక్షమునకు ఒకేఒక ఉపాయముగలదు మనదారిద్ర్యబంధ మోక్షమునకు మనము బాహిర ప్రపంచాన్వేషణముకంటె ఆత్మాన్వేషణమే పరిష్కారమార్గము. మానవుడు అంతరంగమున పరిశుద్ధుడుగనుండునేని బాహ్యప్రపంచమునగల మురికిప్రదేశముల నివసింప నిచ్చగింపడు. అవమానముల సహించ నిష్టపడడు. ఆతడు తనమనస్సును నిర్మలముగ, నిర్దోషముగ జేసికొనినచో తన గృహమును పరిశుభ్రముగ నుంచుకొనును. తన ఆత్మీయులను బాగుచేయును. క్రమముగా తన పేటను, నగరమును, దేశమును బాగుచేయుటకు ప్రయత్నించును. ఈ విధముగ ప్రతి మనుష్యుడు మొట్టమొదట నతను సంస్కరించుకొనవలెను. పిమ్మట ఆతడు ఇతరుల:

సంపాదించగలడు. అతని మార్పుచెందిన మనస్సు అతని మారినజీవితములో కనబడుచుండును.

కర్తవ్యనిష్ఠవలన మానవుడు దారిద్ర్యమును నిర్మూలించుకొనుటయేగాక అభ్యుదయపథమును కనుగొనగలడు. అప్పుడాతడు సంపన్నుడు, సౌఖ్యవంతుడు, సఫలమనోరథుడు, స్వతంత్రుడు కాగలడు. ప్రశాంతముగ నిశ్చలచిత్తముతో ఆలోచింతువేని జీవితమందలి సమస్తాభివృద్ధులకుకర్తవ్యనిష్ఠ మూలము. దీనివలన శారీరకబలము కలుగును. కష్టపడిపని చేయుస్వభావము ఏర్పడును. జీవితముయొక్క ప్రతివ్యవహారమును జాగ్రత్తగ గమనించు ప్రవృత్తి అలవడును. కర్తవ్యనిష్ఠవలన మనలోప జాగ్రత, సాహసము, సత్యసంధత, వజ్రసంకల్పము స్వావలంబనము పెంపొందగలవు. సకల సఫలతలకు కీలకమనదగు ఆత్మవిశ్వాస భావనసయితము కర్తవ్యనిష్ఠవలననే వృద్ధినందుచున్నది.

జీవితములో సంపూర్ణముగ సఫలమనోరథుడయిన ఒకవ్యక్తిని మీసఫలతకు రహస్యమేమిటని ప్రశ్నింప అప్పుడాయన "నేను ప్రతిదినము ప్రాతఃకాలమున 6 గంటలకు మేల్కాంచెదను. వెంటనే నాకర్తవ్యకర్మయందు నిమగ్నుడనై యుందును" అని జవాబొసంగెను. మిక్కిలిపరిశ్రమించి, స్వకార్యమును చక్కగనక్రమముగ సాధించుగొనునట్టియు అన్యులకార్యములకు అవరోధములను గల్పింపనట్టియు నగువ్యక్తియే సఫలతా సౌభాగ్యమును ప్రాప్తింపజేసికొనగలడు. అట్టివ్యక్తి గౌరవభాజనుడు, ప్రభావశాలి, ప్రతిభావంతుడు కాగలడు.

మిక్కిలి పేదలకు, మిల్లులలో పనిచేయు కార్మికులకు ఏదేని ప్రత్యేకవిద్యగాని, పనిగాని నేర్చుకొనుటకవకాశముగాని, సమయముగాని లభింపదని కొందఱు నుడువుచుందురు. ఇది పొరపాటు ఏదేని ఒక ప్రత్యేక కళగాని, కార్యముగాని, విద్యగాని అభ్యసించుటకుపయుక్తమగు సమయము, సదవకాశము సర్వజనులకు తమ కందుబాటులోనే యుండును. కాని వారు తమ అశ్రద్ధవలన సోమరితనమువలన వాటినుపయోగించుకొనలేకున్నారు.

పై నుదహరించిన పేదలకు, మిల్లు కూలీలకు సయితము సమయము, అవకాశము లభింపగలవు. ఏ కార్మికులు తాము పనిచేయు కర్మాగారములలోనే తమ ప్రస్తుత స్థితిలోనే సంతృప్తినంద గోరెదరో వారు ఆ కర్మాగారములలోనే మిక్కిలి పరిశ్రమతో యజమానియందు భక్తివిశ్వాసములతో పనిచేయవచ్చును. వారు తమ యిండ్లలోనికి సారా, జూదము మున్నగు దుర్వ్యసనములు ప్రవేశింపనీయకుండ చూచుకొనవచ్చును. వారు తమ తీరిక వేళలలో విద్యనభ్యసించి ఉన్నతి నందవచ్చును. పేదలకేమి, భాగ్యవంతులకేమి సమస్తజనులకు దుర్వ్యసనములు, దురభ్యాసములే శత్రువులనుట నిస్సందేహము. ఏ యువకుడు తన జీవితములో ఉన్నతి నందగోరునో అతడు సారాయి త్రాగుట, పొగాకు త్రాగుట, వ్యభిచరించుట, రాత్రులందు ప్రొద్దుపోవువఱకు మేల్కొనియుండుట, నృత్యసంగీతాదులలో, క్లబ్బులలో, సినిమాలలో కాలక్షేపము చేయు

చుండుట మానుకొనవలెను. నేడు భారతదేశములో శ్రమజీవులలో జూదమాడుట, సారాయి త్రాగుట అధికముగ వాడుకలోకలదు.

ఇట్టివ్యక్తులు తమమిగులుసమయమునుతమను విద్యావంతులుగ జేసుకొనుటకు సద్వినియోగము చేసుకొన్నచో ఎంతబాగుండును. ఇదివారి పరమధర్మము. ఈపద్ధతి ననుసరించుటచే ప్రతి దేశములో ధనవంతులు, నిర్ధనులు ఉభయులు ఘనకార్యములు సాధించియుండిరి. మహోన్నతినందిరి. దేశవిదేశములలో రాజకీయవేత్తలుగ, దేశోద్ధారకులుగ సంఘసంస్కర్తలుగ నూతనధర్మసంస్థాపకులుగ సుప్రసిద్ధులయిన మహాపురుషులందఱు సామాన్య పేదకుటుంబములలో జననమందినవారే దేశవిదేశ దేశచరిత్రలే ఇందుకు ప్రమాణములు.

కార్మికులు తమ మిగులు సమయమును తమకు ప్రయోజనకరముగనుండు ఏదేని పనికి వినియోగింపదగుననియు, తమసమయమును శుష్కప్రసంగములకుగాని, పనికిమాలిన పనులకుగాని వృథాపుచ్చరాదనియు మేము పలుసార్లు హెచ్చరించియుంటిమి. ఎవరుతమప్రస్తుత దీనహీనస్థితికి అసంతుష్టిజెంది దిగులుపడియున్నారో ఎవరు తమ భవిష్యత్తును ఉన్నతము ఉజ్జ్వలము గావించుకొనగోరెదరో వారుతామెంత నిరుపేదలో అంతకష్టపడి సహనముతో, ధైర్యముతో పరిశ్రమించి తమఔన్నత్యము

క్రొత్త అనుకృపించలుపుదురుగాక! విఘ్నములు, విపత్తులు ఇట్టి విద్యార్థులకు జ్ఞానోపదేశములయి, వారిపాలిట వరప్రసాదములయి; వారిజీవిత పురోభివృద్ధికి మూలకందములగుగాక!

దారిద్ర్యము మానవునిపాలిట శాపమా! లేక వరప్రసాదమా! అనునది మానవుని చరిత్రపయి, ఆతనిమానసిక స్థితిపయి ఆధారపడి యున్నది. ఈరీతిగనే ధనముకూడ మానవునిపాలిట వరప్రసాదమా లేక అభిశాపమా అనునది మానవుని మానసిక స్థితిపయి ఆధారపడియున్నది. రష్యా దేశస్థుడు, సుప్రసిద్ధ రచయిత, తత్త్వవేత్తయు నగు టాల్‌స్టాయి గొప్పజమీందారు, ధనాఢ్యుడయి యుండెను. ఆయన తనధనము కారణముగ మిక్కిలి బాధపడుచుండెడివాడు. ధనముపేరు విన్నంతనే ఆయన కృంగిపోవుచుండెడివాడు. ఒక లుబ్ధాగ్రేసరచక్రవర్తి ధనముకొఱకు ఎంత ఆతురత, ఆరాటపడుచుండునో టాల్‌స్టాయి నిర్ధనుడగుటకు అంత ఆరాటపడుచుండెడివాడు.

ఎప్పుడు మానవుని మనస్సునుండి లోభము, స్వార్థము వెడలిపోవునో ఏదినమున సారాయిత్రాగుట, సోమరితనము, దురాచారములు, భోగవిలాసములు, మానవసంఘమునుండి శాశ్వతముగ తొలగిపోవునో ఆ దినమున ధనవంతులు, నిర్ధనులు అను భేదము నశించిపోవును. ఏ కొద్దిమంది పవిత్ర హృదయములుగల తప్ప ఇప్పటివఱకు తమ కర్తవ్యముల

పాలింపని అశేషజనులు అపుడు తమ కర్తవ్యముల పరమ సంతోషముతో పాలింప నారంభింతురు. అపుడు సమస్త జనులు ఆత్మగౌరవ సమన్వితులయి, ప్రశాంత హృదయులయి తమ పరిశ్రమను సఫలమొనరించుకొందురు.

---

# మానవుని ఆధ్యాత్మిక సామ్రాజ్యము

మానవుని మనస్సు, జీవితమే ఆతని సామ్రాజ్యము. మేము మొదటను డినుడువుచున్నట్లు మానవుని ఆధ్యాత్మిక సామ్రాజ్యము అత్యంత విశాలమయినది. అఖండమయినది. ఆధ్యాత్మిక సామ్రాజ్యము భౌతిక సామ్రాజ్యమునకు భిన్నమయినదికాదు. అది తనవఱకే పరిమితమయినది కాదు. అది ప్రతిమానవునితోను, సమస్తప్రకృతితోను, అతడు నివశించు పరిసరములతోను, వాతావరణములోను ఇంతయేల యావత్ప్రపంచముతోను సన్నిహితసంబంధము గలిగియున్నది. ఏవ్యక్తి తన మనస్సును జయించెనో ఆతడు సర్వప్రపంచమునే జయించినవాడగును, ఆత్మవిజయమున వలన ఆతడువివేకశిఖరాగ్రమున నధిష్ఠింపగలుగుచున్నాడు. అపుడాతడు మానవపరభావ పరిజ్ఞాతయగుచున్నాడు. అపుడాతడు మంచిచెడుగులు తెలుసుకొనగలుగుచున్నాడు. తాను గావించుకార్యముల పరిణామములను సయితము చక్కగ ఆకలింపచేసుకొన గలుగుచున్నాడు.

వర్తమానయుగమున మానవుడు రకరకముల ఆలోచనలలో మునిగి తేలుచున్నాడు. అవి తమ యిష్టమువచ్చినట్లు వానిని ఆడించుచున్నవి. కాని ఆతడు ఆ ఆలోచనలను తనవశము గావించుకొనుటలో తనజీవితమును శాసింపగలడు. తనజీవితమునేకాదు ప్రపంచమును జయించగలడు.

మూర్ఖుడు తన్ను మినహాయించుకొని ఇతరుల శాసింపగలనని తలంచుచుండును. ఈరీతిగ మూర్ఖులు బాహ్యపరిస్థితులను జక్కదిద్దుటచే తాము సుఖపడగలమని తలంచుచుందురు. కేవలము బాహ్యవిషయములవలన సుస్థిరమగు శాంతి, సుఖము లభింపజాలవు. వివేకము కలుగజాలదు. కేవల బాహ్యోపచారములవలన రోగి శరీరము స్వస్థము, సౌఖ్యవంతము కాజాలదు. మానవుడు తనమనస్సును జయించనంతవఱకు బాహ్యప్రపంచమున ఎన్ని విజయములు సాధించినను అవి అపజయములే యగును. నీపొరుగువాని స్వత్వముల అపహరించుటలో, దుర్బలుని, అమాయకుని మోసగించుటలో మనము జీవితములో విజయము సాధించినట్లు కాదు. నీ పొరుగువాని స్వత్వములను రక్షించుటలో దుర్బలులకు, దుఃఖితులకు సాహాయ్య మొనరించుటలోనే వాస్తవికమగు విజయము కలదని భావింపవలెను. మానవుడు తన మనస్సును వశపఱచుకొనినపుడు బాహ్యపరిస్థితులను తన కనుకూలము గావించుకొనుటకయి ఎక్కువ కష్టపడనక్కఱలేదు. అవి వాటంతటవే అనుకూలములు కాగలవు. అపుడాతని అంతరంగమున ఆనందస్రోతస్సు తరంగాయితమయి తనంతటది ప్రవహింపగలదు. ఏలననగా అపుడాతనికి దైవబలము లభింపగలదు. అపుడాతని జీవితము శాంతికి నిలయమగుచున్నది. అపుడాతని పాపములు పటాపంచలములగుచున్నవి. కామక్రోధాది వికారములు విదారితము లగుచున్నవి. అపుడాతని శరీరము సయితము శక్తిమంతమగుచున్నది.

మానవుడు తనమనస్సును శాసింపగలడు. తనకుతానే యజమాని. ఆతడు తనమనస్సును [illegible] ఆతని జీవితము అసంతృప్తికరముగ, అస్తవ్యస్తముగా నుండ గల్గదు. ఏ మానసికశక్తులవలన మానవప్రభావము ఏర్పడినదో ఆ మానసికశక్తులే ఆతని ఆధ్యాత్మిక [illegible]తమునకును ఉపకరించగలవు. వట్టిశరీరము [illegible] ఉపకరించదు. అది మాంసపుముద్దమాత్రమే. శరీరమును శాసింపజూచు కామక్రోధాదులను నిరోధింపగల స్వభావము, శక్తిసామర్థ్యములు కేవలము మనస్సునకుమాత్రమే కలవు.

ప్రతిమనుష్యుడు పరిస్థితులకనుకూలముగ తన మనస్సును ఏర్పఱచుకొనవలెను. తన మనస్సును వశ మొనరించుకొని దానిని యుద్ధోచితముగ నుంచుకొనవలెను. మనుష్యుడు చిరకాలమునుండి బాహ్యవిషయములకు బానిసగనున్నాడు. కాని ఆతని జీవితములో ఏదో ఒకనాడు ఆతని ఆధ్యాత్మికనేత్రము తెఱువబడగలదు. అపుడాతడు నేనింతవఱకు నా అసంయమిత, అపవిత్రమనస్సునకు దాసుడుగా నుంటినని గ్రహించు శుభముహూర్తము రాగలదు. అపుడాతడు మేల్కొనగలడు. ఆశుభదినము ఆతని జీవితమునకుఒక నూతనశక్తిని, నవ్యోత్సాహమును కలుగ జేయును. ఆతనివిధినే తలక్రిందు చేయును, ఆదినము భిక్షుకుని రాజుగను, అల్పబుద్ధిని మహామనీషిగను జేయగలదు. ఆ దినము ఆతని జీవితచరిత్రలో స్వర్ణాక్షరములతో లిఖింప దగియుండును. అపుడాతడు ఆధ్యాత్మికగద్దె నధిష్ఠింపగలడు.

అప్పుడాతడు తన కోరికలకు, విషయవాసనలకు దాసుడుగనుండ జాలడు. అతడెంత దీనహీన భిక్షుక స్థితినుండి ధనవంతుడుగ మారినది, ఏరీతి ఉన్నత శిఖరము ఆరోహించినది తెలిసికొని తనమనస్సులో సంభ్రమాశ్చర్య సంభరితుడగును. ఇప్పుడాతని రోజులు మారినవి ఇపుడాతడు తన మనోవికారముల నిర్మూలించివైచి శాంతిపథమున పయనించు చున్నాడు అపుడాతడు ఆ యా యుగములలో జనుల అజ్ఞాన దారిద్ర్యముల నిర్మూలించిన మహోపకారులయిన మహాపురుషుల శ్రేణికి జేరుచున్నాడు.

---